# జీవన్ మరియు హాను

# మాట్లాడుకుంటున్నారు

వేల సంవత్సరాల క్రితం, మానవ జాతి, లిఖితపూర్వకమైన భాషను కనిపెట్టక పూర్వం, ఆది మానవుడు తన భావాలను గుహల గోడలపైన, మోటుగా వుండే రేఖా చిత్రాలతోనూ, బొమ్మలతోనూ వ్యక్తంచేసేవాడు. ఫ్రాన్సు దేశంలోని లాస్కోలో యిటువంటి చిత్రాలని చూడవచ్చును.



This represents 'warriors'.

పురాతన కాలంలోని ఈజిప్షియన్లు (క్రీ. పూ. 3000 నుంచి) బొమ్మలద్వారా వస్తువులూ, ఊహాలూ సూచించే ఒక పద్ధతిని అవలంబించారు. ఈ బొమ్మల భాషని 'హైరోగ్లిఫిక్స్' అంటారు.



WEEP CATTLE WIDOW

ఈ చిహ్నాలలో ప్రతిదీ ఒక ప్రత్యేకమైన మాటని గూడా సూచిస్తుంది. కాల క్రమేణా, యీ చిహ్నాలు మొట్టమొదటగా కనిపెట్టబడిన మాట యొక్క ముఖ్యమైన ధ్వనిని మాత్రమే సూచించేవిగా రూపొందాయి.-వాటి అర్థాలు కాదు.



M WR ANKH

నేటికీ వాడుకలో వున్న యీ రీబస్ అనే పద్ధతిని తేలికైన ఆటలో వాడుతారు. మాటలు చెప్పడానికి బొమ్మల్ని వాడతారు దీన్లో. ఈ క్రింద యివ్వబడిన రీబస్ ఆటలో, చెప్పవలసిన అసలు సందేశానికి రంపాలూ, తాళ్ళూ లాంటి వాటితో, మాటలతో ఏ మాత్రం సంబంధం లేదు. ఆ వాక్యం యిలా ఉంటుంది.



SUM ONE SAW





MEN-KNEE PEA- PULL





RACE BEE-EYE

చైనా దేశపు లిపి (పిక్టోగ్రామ్స్ అంటారు) కూడా అదే పద్ధతిలో రూపొందింది. సరళమైన రీతిలోని వస్తువులూ, ఊహాలూ వీటిని విపులమైన తీరులో బ్రష్‌తో పెయింట్ చేయడం.



TREE + SUN = EAST
(sun rising behind tree)



ఈజిప్షియన్ భాషలోలాగే, యీ చిహ్నాలు గూడా ధ్వనికి సంకేతాలే.

ఈ బ్రష్-స్ట్రోక్ అంటే అసలు మూలమైన అర్థం 'Pot'-దీనిని 'Li' అని పలికేవారు. పోలికలను గమనించండి. భాష వికసించిన కొద్దీ, యీ గుర్తు 'Li' అనే ధ్వనికి సంకేతం అయింది.

మరి నేడు మనకి అక్షరాలున్నాయి — దాన్లో ప్రతి సంకేతమూ ఉచ్చరించే ఒక మాటకు చిహ్నం. భారతదేశపు పురాతన అక్షరక్రమాన్ని బ్రహ్మి అంటారు. అయితే బొమ్మలతో చెప్పడం యింకా అమలులోనే ఉంది మరి! ట్రాఫిక్ సంకేతాలని గమనించండి మీకే తెలుస్తుందిక,

జీవితభీమా అనేది మీ కుటుంబాన్ని సురక్షితంగా ఉంచుకోవడానికి అతి భద్రమైన మార్గం



లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా



1983 WORLD COMMUNICATIONS YEAR







daCunha/LIC/141/83 TL


దగ్గుని
నిద్రపుచ్చుతుంది
గ్లైకోడిన్
Glycodin
• మీ మెదడులో దగ్గు ప్రేరేపణ కేంద్రాన్ని అదుపు చేస్తుంది.
• మీ గొంతులో గరగరలాడటం నుంచి ఉపశమనం కలిగిస్తుంది.
• మీ ఊపిరితిత్తుల్లోని కఫాన్ని తొలగిస్తుంది.
• మీ ఛాతీలో బిగుసుకున్న కండరాలని సడలిస్తుంది.
గ్లైకోడిన్-దగ్గునుంచి ఉపశమనం కల్గించే ఈ నమ్మకమైన మందు 4 విధాలుగా పనిచేస్తుంది.
హాయిగా, ఉషారుగా నిద్రలేవండి.
everest/83/ACW/307-tel

# చందమామ

## మనసంస్కృతిని తెలుసుకోండి పోటీ

### ఎంట్రీలు పరిశీలిస్తున్నాం!

లక్షకు పైగా ఎంట్రీలు వచ్చాయి. ఈ పోటీలో ఎంతో ఉత్సాహంతో పాల్గొన్న పాఠకులందరికీ మా ధన్యవాదాలు తెలియజేస్తున్నాము. ఎంట్రీల పరిశీలన జరుగుతున్నది.

ఈ సంచికలో మీరు పోటీ ఫలితాల కోసం ఎదురుచూసి వుంటారు. ఎంట్రీలు అసంఖ్యాకంగా రావడంవల్ల, పరిశీలనకు అనుకున్న దానికన్నా ఎక్కువ సమయం తీసుకుంటున్నది. మా న్యాయనిర్ణేతలు ఆ పనిలోనే నిమగ్నులై వున్నారు. పోటీ ఫలితాలను వచ్చే సంచికలో తప్పక ప్రకటిస్తాము.

పాఠకులు సహృదయంతో సహకరించగలరని ఆశిస్తున్నాము.



# వనిత

మీరు చదువుతున్నారా?

సుప్రసిద్ధ రచయిత్రి

## ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి

కలంనుండి వెలువడుతున్న సశేష నవల

## స్వయంసిద్ధ

నెలనెలా పఠితలలో ఉత్కంఠను రేకెత్తిస్తూ
విశేషంగా ఆకర్షిస్తున్నది!

వనితలకు ఉపయుక్తమైన అనేక విషయాలను ప్రస్తావిస్తున్న
ఏకైక స్త్రీజన మాసపత్రిక

# వనిత



# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["కలలప్రభావం"] కు ఆధారం మాచిరాజు కామేశ్వరరావు రచన.

శారీరక, మానసిక శ్రమంటూ ఏమీ చేయకుండా, ఏవో చిట్కాల ద్వారా ధనం సంపాయించ చూడడం పరమమూర్ఖత్వం అవుతుంది. ప్రారంభంలో మేలు కలిగించేలా కనిపించే అలాంటి చిట్కాలు, తరవాత మనిషికి ప్రతిబంధకాలవుతవి. ఈ నీతి, "అపూర్వవిద్య" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

నీచే నాల్పతయా దృష్టో, వ్యధికో న విచారయేత్,
దర్పణే వర్వతోవ్యల్పే, దృశ్యతే లఘువత్గలు.

[నీచుడు తనను కించపరచినా, ఉత్తముడైనవాడు బాధపడకూడదు. మహాపర్వతం పంటిది, చిన్న అద్దంలో చిన్నదిగానే కనబడుతుంది.]

సంపుటి 73 అక్టోబర్ '83 సంచిక 4

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



## చందమామ కబుర్లు



### సూర్యకుటుంబంలో అతిథిగ్రహం?

సూర్యకుటుంబంలోకి కొత్తగా ఒక గ్రహం ప్రవేశించి వుండవచ్చని ఖగోళశాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. నెప్ట్యూన్, యురేనస్ గ్రహాలు తమ క్రమమార్గం నుంచి కొద్దిగా వైదొలుగుతున్నాయనీ – నూతన గ్రహ ప్రవేశమే దానికి కారణం అయి వుంటుందనీ 'సైన్స్ డైజెస్ట్' అనే అమెరికా పత్రిక తెలియజేస్తోంది.

### బౌలింగ్‌లో సరికొత్త రికార్డు



అమెరికాకు చెందిన జేమ్స్‌హార్ట్‌మన్ అనే సైనిక ఉద్యోగి, గంటకు ఐదు నిమిషాలు విశ్రాంతి తీసుకుంటూ – నూటయాభై ఆరు గంటల, ఇరవై నిమిషాలు బౌలింగ్ (బరువైన బంతివిసిరి) చేసి ప్రపంచ రికార్డు సృష్టించాడని "ది న్యూ టైమ్స్" అనే సోవియట్ రష్యా పత్రిక తెలియజేసింది.



### కొమ్మలపై కాపురం!

ఇటీవల అర్జెంటైనాలో వచ్చిన వెల్లువలప్పుడు – భార్యాభర్త లిద్దరు చెట్టెక్కి, రెండు నెలలపాటు అక్కడే కాపురం పెట్టారు. ఆకులతో, రెమ్మలతో చెట్టుకొమ్మలపై గూడులాంటి గుడిసె నిర్మించుకున్న ఆ దంపతులకు కొమ్మకు కట్టబడిన ఒక చిన్న పడవ వంటగదిగా ఉపయోగపడింది. చెట్టుకొమ్మలపై నుంచి, కింది నీటిలో చేపలు పట్టుకుంటూ వాళ్ళు కాలం గడిపారు.

## మీకు తెలుసా?

1. భారతదేశానికి ప్రప్రథమంగా జట్టులు జట్టులుగా వచ్చిన విదేశీయులెవరు? ఎప్పుడు వచ్చారు?
2. మనదేశానికి వచ్చిన తొలి ఇటలీ ప్రయాణీకుడెవరు? ఆయన సందర్శించిన ప్రాచీన నగరం మీకు తెలుసా?
3. మనదేశ పర్యటనకు వచ్చిన తొలి రష్యా ప్రయాణీకు డెవరు?
4. భారతదేశానికి వచ్చిన తొలి పోర్చుగీసు ప్రయాణీకు డెవరు?
5. మత్స్యదేశంగా ప్రసిద్ధిగాంచిన ప్రాంతం మన దేశంలో ఎక్కడ వున్నది?

(సమాధానాలు 64వ పేజీలో)




# అభిమాని

విజయపుర రాజ్యంలో నివసించే శ్రీకాంతుడు మహాకవి. ఆయన మాట్లాడిన ప్రతిమాటా, ఒక పద్యమైపోతుందని ఎందరో అనుకునేవారు. ఆ కారణంగా ఆయనను కలుసుకుని మాట్లాడాలని చాలా మంది ఎంతో తహతహ లాడి పోతూండేవారు.

అయితే, శ్రీకాంతుడికి అహంకారం ఎక్కువ. తనకోసం ఎవరు వచ్చినా, ఒక పట్టాన వారిని కలుసుకునే వాడుకాదు.

ఆయనకు రాజాదరణ వున్నది. రాజు వద్ద కూడా శ్రీకాంతుడు అహంకారంగానే ప్రవర్తించేవాడు. మహాకవులకు అహంకారమే ఆభరణం అని, రాజు కూడా ఆయన అహంకారాన్ని భరించేవాడు.

రాజధానికి చాలా దూరాన వున్న ఒక అగ్రహారంలో కనకభూషణుడు అనే యువకుడొకడుండేవాడు. అతడిది పండిత కుటుంబం. శ్రీకాంతుడి కవిత్వమంటే అతడికి ఎంతో యిష్టం. ఆ మహాకవి అంతవరకూ రాసిన కావ్యాలన్నిటినీ అతడు చదవడమే కాక, కొన్నిటిని కంఠస్థం కూడా చేశాడు. ఆయన వల్లమాలిన అహంభావి అని ప్రజలు చెప్పుకోవడం విన్నప్పుడు, అతడి మనస్సు చివుక్కుమనేది.

ప్రజలు చెప్పుకునేదాంట్లో వున్న నిజానిజాలు స్వయంగా తెలుసుకోవాలని కనకభూషణుడు నిశ్చయించుకుని, రాజధాని చేరి శ్రీకాంతుడిని చూడబోయాడు.

ఒక రోజంతా శ్రీకాంతుడు ఇంట్లోనే వుండి, లేడనిపించాడు. రెండవరోజు కావ్యపఠనంలో వున్నానన్నాడు. మూడవ రోజు కావ్యం రాస్తున్నానన్నాడు. నాల్గవ రోజున ఆయన కనకభూషణుడికి దర్శనం యిచ్చి, ''నాకు, నీవంటివాళ్ళను కలుసు



కుని మాట్లాడేందుకు వ్యవధిలేదు. ఏం కావాలో త్వరగా చెప్పు,'' అన్నాడు.

''మీ కవిత్వమంటే, నాకు ఎంతో యిష్టం. మిమ్మల్ని చూడడంకోసం, ఒక సంవత్సరమంతా కష్టపడి డబ్బు కూడ బెట్టి, యిక్కడకు వచ్చాను,'' అన్నాడు కనకభూషణుడు.

''బావుంది, నన్ను చూసి ఏం చేస్తావు?'' అన్నాడు శ్రీకాంతుడు.

''కాసేపు మీతో మాట్లాడాలనివుంది,'' అన్నాడు కనకభూషణుడు.

''నేను మాట్లాడితే వినడం తప్ప, నాతో నువ్వేం మాట్లాడగలవు? నేను మహా కవి!'' అన్నాడు శ్రీకాంతుడు.

''మీరు చెప్పింది నిజమే. ఇంతవరకూ ఎవ్వరికీ వినిపించని పద్యం ఒకటి, నాకు వినిపించండి. అదే మహాప్రసాదంగా భావించి వెళ్ళిపోతాను,'' అన్నాడు కనకభూషణుడు.

''మహారాజు కోరితేనే, నేను పద్యం వినిపించను. నేనుచెప్పాలనిపించితేతప్ప, ఒకరు అడిగినప్పుడు పద్యం చెప్పే అలవాటు నాకులేదు,'' అన్నాడు శ్రీకాంతుడు.

''పోనీ, మీ ఇంటి అరుగు మీద కూర్చునివుంటాను; మీకు చెప్పాలనిపించినప్పుడే చెప్పండి,'' అన్నాడు కనకభూషణుడు వినయంగా.

''నీవంటివాడికి, నా పద్యం ఒంటరిగా వినే అర్హతలేదు. కావాలంటే రాజాస్థానానికి వచ్చి, పదిమందిలోనూ కూర్చుని విని వెళ్ళు. అదీ సంగతి! ఇక నన్ను వేధించకు, వెళ్ళు,'' అని శ్రీకాంతుడు కసిరాడు.

చేసేదిలేక కనకభూషణుడు నిరాశగా వెళ్ళిపోయాడు.

మర్నాడు శ్రీకాంతుడికి, వాళ్ళ అన్న రమాకాంతుడికి బాగా జబ్బు చేసినట్టు కబురు వచ్చింది. ఆయన రాజధానికి దూరంగా వున్న ఒక గ్రామంలో వుంటున్నాడు. రాజు, శ్రీకాంతుడి కోసం ఒక గుర్రపుబండిని ఏర్పాటుచేశాడు.

ఆ బండిలో శ్రీకాంతుడు కొన్ని గంటలు ప్రయాణం చేశాక, హఠాత్తుగా గుర్రం శోషవచ్చి పడిపోయింది. బండివాడు గుర్రాన్ని పరీక్షించి చూసి, శ్రీకాంతుడితో, ''అయ్యా, గుర్రానికి ఏదో జబ్బు చేసింది. ఇక్కడికి కొద్ది దూరంలో ఒక నగరమున్నది. దాని పొలిమేరల్లో ఒక సత్రం వున్నది. మీరు బయలుదేరి వెళ్ళి అక్కడ బస చేయండి. నేను గుర్రానికి వైద్యం చేయించి, నయమవగానే బండి తీసుకువస్తాను,'' అన్నాడు.



చేసేదిలేక శ్రీకాంతుడు కాలినడకన బయలుదేరాడు. బండివాడు అన్నట్టు కాక నగరం చాలా దూరం వున్నది. ఆయన దాని పొలిమేరలు చేరేసరికి, దుస్తులన్నీ మట్టికొట్టుకుపోయాయి. ఆయన ఆయాస పడుతూ, వినుక్కుంటూ సత్రం చేరాడు.

సత్రం యజమాని శ్రీకాంతుడితో, ''గదులు ఖాళీలేవు. నడవలో వుంటానంటే నాకేం అభ్యంతరంలేదు,'' అన్నాడు.

''నేను మహాకవి శ్రీకాంతుణ్ణి! నడవలో వుండడమా? వెంటనే గది ఏర్పాటు చెయ్యి,'' అన్నాడు శ్రీకాంతుడు కోపంగా.

ఆ మాటలకు సత్రం యజమాని అదే పనిగా నవ్వసాగాడు.

''అలా నవ్వుతావేం?'' అన్నాడు శ్రీకాంతుడు మరింత కోపంగా.

''నవ్వకేంచేసేది? నీ దురదృష్టం కొద్దీ ఆ మహాకవి శ్రీకాంతుడే ఇవ్వాళ సత్రంలో బసచేసి వున్నాడు. లేకపోతే, నీ మాటలు నమ్మి వుండేవాణ్ణి,'' అన్నాడు సత్రం యజమాని.

శ్రీకాంతుడు ఆశ్చర్యంగా, ''ఏదీ, ఆ శ్రీకాంతుణ్ణి నాకు చూపించు!'' అన్నాడు.

''పక్కగదిలో వున్నాడు, మర్యాదగా చూసి వచ్చెయ్యి. ఆయన కావ్యగోష్ఠిని నువ్వెళ్ళి చెడగొట్టకు,'' అన్నాడు సత్రం యజమాని.

శ్రీకాంతుడు ఎంతో కుతూహలంగా, సత్రంయజమాని చెప్పిన గదివద్దకు వెళ్ళి, లోపలి దృశ్యం చూసి తెల్లబోయాడు.

అక్కడ తనలాగే దుస్తులు ధరించి, తనను అనుకరిస్తూ మాట్లాడుతున్న ఒక మనిషి కనిపించాడు. అతడి చుట్టూ ఎందరో అభిమానులున్నారు. వాళ్ళు వేస్తున్న ప్రశ్నలకు అతడు ఓపిగ్గా సమాధానాలు చెబుతున్నాడు. ఫలాని కావ్యం ఎందుకు రాయవలసి వచ్చిందని కొందరూ, ఫలాని పద్యానికి అర్థమేమిటని కొందరూ, ఇలా రకరకాల ప్రశ్నలు వేస్తున్నారు. కొందరు పద్యాలు చదవమంటున్నారు. అతడు శ్రావ్యంగా పద్యాలనాలాపిస్తూ, వాటి అర్థాన్ని చక్కగా వివరించి చెబుతున్నాడు.

బాగా పరీక్షించి చూడగా, ఆ మనిషి ఎవరో శ్రీకాంతుడికి తెలిసిపోయింది. అతను కనకభూషణుడు!

ఇప్పుడు ఏం చేయడం బావుంటుందా అని శ్రీకాంతుడు ఆలోచిస్తున్నంతలో, గోష్ఠి ముగిసి, అంతా వెళ్ళిపోయారు. ఆయన కనకభూషణుడి దగ్గిరకు వెళ్ళి కోపంగా, ''నా పేరు పెట్టుకుని, ఎందుకిలా అందర్నీ మోసం చేస్తున్నావు?'' అని అడిగాడు.

కనకభూషణుడు, శ్రీకాంతుడికి ఎంతో వినయంగా నమస్కరించి, ''తమను కలుసుకుని మాట్లాడిన తర్వాతే, నాకీ బుద్ధిపుట్టింది. మీరంటే నాకెంతో అభిమానం. మిమ్మల్ని గురించి ఎవరైనా, చెడ్డగా అనుకుంటే, నేను భరించలేను. అందుకే, మీ పేరు చెప్పుకుంటూ, మీకు లేని వినయగుణాన్ని నటిస్తూ, మీకు మంచిపేరు తెస్తున్నాను. ఇప్పుడిక్కడి నుంచి వెళ్ళిన వాళ్ళందరూ, మీ గుణగణాల్ని మెచ్చుకుంటూ వెళుతున్నారు. జీవితంలో వాళ్ళు మిమ్మల్ని చూడకపోవచ్చు; కానీ, మీగురించి చాలా గొప్పగా ఊహించుకుంటారు. మీ అభిమానిగా అదే నేను కోరుకునేది!'' అన్నాడు.

అలాంటి ఉత్తమ అభిమానిని చీదరించుకున్నందుకు శ్రీకాంతుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. ఆ తరవాత ఆయన ప్రవర్తన పూర్తిగా మారిపోయింది.






## 6

[పద్మపాదుడూ, పింగళుడూ భల్లూకపర్వతాల లోయలో గల నదివద్దకు వెళ్ళారు. నదీజలాన్ని యింకింపజేసేందుకు, పద్మపాదుడు సమాధినిష్ఠలో మంత్రం జపిస్తూండగా, పింగళుడు గద చేబూని, అతడికి రక్షణగా వున్నాడు. కొంతసేపటికి నదీజలం యింకిపోయింది. అందులో నుంచి, పాడుబడిన దేవాలయశిఖరం బయటపడింది. తరవాత—]

పద్మపాదుడు దేవాలయ శిఖరం కేసి కొంతసేపు పరీక్షగా చూసి, దానిపక్కనే నిలబడి వున్న మహామాయుడి శిష్యులను దగ్గరకు రావలసిందిగా చేయి వూపాడు. మహామాయుడి శిష్యులిద్దరూ త్రుటికాలంలో, పద్మపాదుడిని సమీపించి, అతడికి వంగి నమస్కరించారు.

''మీరు నా ఆజ్ఞను శిరసావహించినందుకు, నాకు చాలా సంతోషంగా వుంది. ప్రస్తుతానికి మీ యిష్టంవచ్చిన చోటుకు వెళ్ళవచ్చు,'' అన్నాడు పద్మపాదుడు చిన్నగా నవ్వుతూ.

మహామాయుడి శిష్యులు ముఖముఖాలు చూసుకున్నారు. వారిలో ఒకడు ధైర్యం తెచ్చుకుని, ''మహామాంత్రికా! దయతో, మా విన్నపం ఆలించవలసిందిగా ప్రార్థిస్తున్నాము. మావల్ల మీకు కావలసిన సహాయం అయిపోయింది. ఇకనైనా




పాదుడికి సాష్టాంగ పడి, "మహా మాంత్రికా! మేము మీకు దాసాను దాసులం! మంత్రబలంతో మీరు మమ్మల్ని బంధించిన నాటినుండి, మాకు కడుపు నిండా ఆహారమే లేదు. మేము శక్తిహీనుల మైపోయాం!" అంటూ విలపించసాగారు.

పింగళుడికి, వాళ్లిద్దరి మీదా ఎంతో జాలి కలిగింది. అతడు పద్మపాదుడి కేసి తిరిగి, "పద్మపాదా!" అంటూ ఏమో చెప్ప బోయేంతలో, పద్మపాదుడు అతణ్ణి వారించి, మహామాయుడి శిష్యులతో ఇలా అన్నాడు:

"మీరు, యింతకాలంగా ఆహారం లేక ఉపవాసాలు చేస్తున్నారని నాకు తెలుసు. మీకు వేటాడే శక్తిలాంటిది గనక, నేను ప్రసాదిస్తే—ఆ మరుక్షణం, మీరు నన్నే వేటాడి చంపేందుకు ప్రయత్నిస్తారు! అవునా?"

"మహా మాంత్రికులైన మిమ్మల్ని, క్షుద్రులమైన మేము వేటాడటమా?" అంటూ, మహామాయుడి శిష్యులు దీనాతి దీనంగా ముఖాలు పెట్టారు.

పద్మపాదుడు నవ్వాడు. తరవాత, పింగళుడి చేతిలోంచి మంత్రశక్తి గల గద తీసుకుని, "మీ యిద్దరికీ, ప్రస్తుతానికి మానవులను తప్ప, మరి దేనినైనా చంపి తినగల శక్తి యిస్తున్నాను. మీకు

మమ్మల్ని మంత్రవిముక్తుల్ని చేయరాదా?" అని అడిగాడు.

"నే వచ్చినపని నెరవేరందే, మిమ్మల్ని మంత్ర విముక్తుల్ని చేయటమా?" అంటూ పద్మపాదుడు బిగ్గరగా నవ్వి, "మీరు, మామూలు పిశాచాలు కాదనీ, మహాదుష్ట క్రూర పిశాచగణానికి చెందిన వారనీ నాకు తెలుసు! కనుక, మీ గురువు సమాధి నుంచి, నాకు కావలసినవి, నేను సంగ్రహించందే, మిమ్మల్ని మంత్రవిముక్తుల్ని చేయటమనే ఆలోచనే లేదు," అన్నాడు.

పద్మపాదుడి మాటలు వింటూనే, మహామాయుడి శిష్యులిద్దరూ వెల వెల పోయారు. తరవాత వాళ్ళిద్దరూ, పద్మ

ఎలాంటి రూపాలు కావాలని వుంది?'' అని అడిగాడు.

''పద్మపాదా! వాళ్ళను ఏనుగులుగా మార్చండి. ఆ కనబడే అడవిలో నిర్భయంగా బ్రతకగలరు,'' అన్నాడు పింగళుడు.

''ఏనుగు రూపాలా? మహామాంత్రికా వద్దు వద్దు!'' అంటూ మహామాయుడి శిష్యులిద్దరూ ఏక కంఠంతో అరిచారు. ''ఆ రూపాల్లో మేము ఆకూ అలములూ తప్ప మాంసాహారం తినేందుకు అవకాశం లేదు! మాకు శాకాహారం పడదు. అది మా దేహాలకు విషతుల్యం!''




''అలా అయితే, మీలో ఒకరిని సింహంగానూ....'' అంటూ పద్మపాదుడు, మహామాయుడి శిష్యుల్లో ఒకడి నెత్తిమీద గదతో మోదాడు. మరుక్షణంలోనే వాడు సింహంగా మారిపోయాడు. ''మరొకణ్ణి పెద్దపులిగానూ, మారుస్తున్నాను!'' అని పద్మపాదుడు, రెండవవాడి తల మీద గదతో బాదాడు. వాడు పులిగా మారాడు.

పింగళుడు, ఓ తృటికాలం వాళ్ళిద్దరి కేసీ ఆశ్చర్యంగా చూసి, ''ఇక మీకు కావలసినంత మాంసాహారం! ఆ కనబడే అడవికి పొండి!'' అంటూ, సింహాన్నీ, పెద్దపులినీ వీపుల మీద తట్టాడు. వెంటనే క్రూరమృగాల రూపంలో వున్న మహామాయుడి శిష్యులిద్దరూ, గర్జిస్తూ దాపులనే వున్న అడవి కేసి పరిగెత్తారు.

పద్మపాదుడు, మహామాయుడి శిష్యుల కేసి కొద్దిసేపు చూసి పింగళుడి కేసి తిరుగుతూ, ''పింగళా! మనం ఎంతో మెలుకువగా వుండవలసి వుంది! మన ప్రయత్నాన్ని విఫలం చేసేందుకే కాక, వీలయితే మనలను సంహరించేందుకు కూడా, అనేక దుష్టశక్తులు ప్రయత్నిస్తున్నవి. సరే, ఇక మన పని చూద్దాం! ఆ పాడు దేవళపు శిఖరం, నీకు స్పష్టంగా కనబడుతున్నది గదా?'' అని అడిగాడు.

పింగళుడు అవునన్నట్టు తల వూపి, ఆ దిక్కు కేసి చూశాడు.



''అయితే, నువ్విప్పుడా దేవళంలోని, మహామాయుడి సమాధిని చేరవలసి వుంది. ఆ సమాధిలో నువ్వు ప్రవేశించే ముందు, నువ్వు దాటవలసిన ద్వారాల సంఖ్య ఆరు. ఆ ఆరు ద్వారాలకూ రక్షకులుగా మహాభయంకరులైన మాయా రక్కసులు వున్నారు. వారిలో ప్రతి ఒక్కరూ నిన్ను సంహరించేందుకు ప్రయత్నిస్తారు. నువ్వు వాళ్ళను చూసి, ఏమాత్రం వెరపు కనబరిచినా, మన ప్రయత్నం వమ్ముకావటమే గాక, ప్రాణాపాయం కలిగే ప్రమాదం కూడా వుంది. అందువల్ల నువు ధైర్యంగా ముందుకు పోవాలి,'' అన్నాడు పద్మపాదుడు.

పింగళుడు జవాబివ్వ లేదు. అతడి దృష్టి నదీ గర్భాన గల పాడు దేవళం మీదనే వుంది. పద్మపాదుడు అతడి కేసి ఓమారు చూసి, "పింగళా, ఇక మనం దేవళం దగ్గిరకు వెళదాం. దానికి గల ఆరు ద్వారాలలోనూ మొదటి ద్వారం వరకూ నేను రాగలను. ఆ ద్వారాన్ని నువ్వు తెరుచుకున్న తరవాత, తక్కిన అయిదు ద్వారాలను కూడా తెరుచుకుని, మహామాయుడి సమాధిలో ప్రవేశించవలసిన వాడివి నీవు!'' అన్నాడు.

పద్మపాదుడూ, పింగళుడూ ఒక్క చుక్కనీరైనా లేకుండా యింకిపోయిన, నదీగర్భంలో నుంచి నడిచి, పాడు దేవళాన్ని సమీపించారు. దేవళానికి వున్న మొదటి ద్వారం, చూపరులకు చాలా భయం కొల్పుతున్నది. పెద్ద దేవదారు చెక్కతో చేయబడిన తలుపులపై అనేక భయంకరాకృతులు చెక్కబడినై. రెండు తలుపులలోనూ బిగించబడిన, రెండు పెద్ద మేకులకు చుట్టుకుని, ఒక సర్పం పడగవిప్పి బుసలు కొడుతున్నది.

పద్మపాదుడు ఆ సర్పం కేసి చేయి వూపుతూ, ''పింగళా, నువ్వు నిర్భయంగా ఆ సర్పాన్ని సమీపించి, దానిని రెండు సార్లు నీ చేతితో తాకవలసి వుంది. ఆ తరవాత ద్వారం లోపలినుంచి, ఒక

భీకరాకారం నిన్ను ప్రశ్నిస్తుంది. నువ్వు ఎవరివైనదీ నిర్భయంగా చెప్పిన తరవాత ద్వారం తెరుచుకుంటుంది. కాని....ఆ తరవాత ఏం జరగబోయేదీ నీకు చెప్పట మంటే నేను నా మంత్రశక్తిని కోల్పోవ టమే నన్నమాట! కనుక, నువ్వు దేనికీ భయపడకుండా వుంటే, అన్ని ద్వారాలూ తెరుచుకుని, మహామాయుడి సమాధిలో అడుగుపెట్టే అవకాశం కలుగుతుంది. అక్కడి అపూర్వ వస్తువుల సంగతి తెలుసు గదా?'' అన్నాడు.

''పద్మపాదా! నేను ఎటువంటి భీకర శక్తికీ భయపడను. కాని, మోసం చేసి నన్ను హతమార్చ చూసే దుష్టశక్తులేవీ యీ పాడుదేవళంలో లేవుగదా ?'' అని ప్రశ్నించాడు పింగళుడు.

''కావాలనుకుంటే నిన్ను మోసగించ కుండానే, యీ దేవళంలో వున్న శక్తులు నిన్ను హతమార్చగలవు. కాని, నీవు ఏమాత్రం భయపడకుండా ముందుకు వెళ్ళినప్పుడు అవి నిన్ను ఏమీ చెయ్య లేవు. మహామాయుడి సమాధి నుంచి, నువ్వు మనకు కావలసిన వస్తువులు సంపాయించిన నాడు, నీకన్న యీ ప్రపం చంలో శక్తిమంతుడూ, ధనవంతుడూ మరొకడుండడు,'' అన్నాడు పద్మ పాదుడు.




''అందుకోసమేగదా, నేనిన్ని ప్రమా దాలకు ఎదురీదేందుకు సిద్ధమయాను!'' అంటూ పింగళుడు ముందుకు నడిచాడు.

అదే సమయంలో పద్మపాదుడు వెను దిరిగి, లోగడ తను సమాధి నిష్ఠలో వుండి మంత్రం జపించిన చోటుకు వచ్చాడు.

పింగళుడు నిర్భయంగా ద్వారాన్ని సమీపించి, పడగ విప్పి బుసలు కొడుతూ వున్న సర్పాన్ని, తన కుడి చేతితో రెండు సార్లు తాకాడు. అంత భయంకర సర్పమూ తల వంచి కదలా మెదలక వూరుకున్నది. కాని, అదేక్షణాన తలుపుల వెనక భూమి దద్దరిల్లేలా కర్ణకఠోరమైన ధ్వనితో ఒక కర్కశకంఠం యిలా ప్రశ్నించింది:



"లోపలకు రావటం ఎలాగో తెలియకుండానే, మహామాయుడి సమాధి ప్రథమ ద్వారాన్ని సమీపించిన పిరికి పంద ఎవడు?"

"నా పేరు పింగళుడు! నేను అవంతీ నగరపు జాలరిని! నా గురువు పద్మ పాదుడు," అన్నాడు పింగళుడు.

"చాలు, చాలు! నీగురువు ఎవరన్నది, నా కవసరంలేదు. నీవుజాలరి పింగళుడివి! ఇదిగో తలుపు తెరుస్తున్నాను!" అన్న శబ్దం అయింది. మరుక్షణాన తలుపులు రెండూ బార్లా తెరుచుకున్నవి. పర్వతాకారంలో వున్న నల్లని వాడొకడు తళ తళలాడే కత్తి చేబట్టి, ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు. పింగళుడు ముందుకు నడిచాడు.

సరిగా కత్తి వేటుకు అందే దూరంలోకి పింగళుడు రాగానే, పర్వతాకారుడు 'హుం' అని హుంకరిస్తూ, "నువ్వు జాలరి పింగళుడివా? అయితే, మెడ చాచు, ఒక్క వేటుకు నీ కుత్తుక తెగేలా, యీ కత్తితో నరుకుతాను!" అన్నాడు.

కనురెప్పపాటులో, పింగళుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. ఇంతదూరం వచ్చి వెనుదిరగటం, ఎలానూ ప్రాణాపాయం అని అతడికి అర్థమైంది. అలా అని, మెడ చాచినా, ఆ మహాకాయుడి కత్తికి అది తెగి కింద దొర్లవచ్చును. ఏమైనా కానీ, అనుకుంటూ, పింగళుడు ఒక అడుగు ముందుకు వేసి మెడ వంచాడు. తక్షణం పర్వతాకారుడి చేతినుంచి కత్తిజారి కింద పడి, ఖంగుమని శబ్దం చేసింది. అతడు, పింగళుడి ముందు శవంలాగా ధడీమంటూ బోర్లాపడిపోయాడు.

ఇలా జరిగేసరికి, పింగళుడికి ఎక్కడ లేని సత్తువా, ధైర్యం కలిగినట్టయింది. అతడు సూటిగా చూస్తూ మొదటి ద్వారం దాటి, రెండవ ద్వారాన్ని సమీపించాడు. ఆ ద్వారం తలుపులు కూడా బంధించి వున్నవి. చేతిలో పెద్ద శూలం ధరించిన ఒక గుర్రపు రౌతు, పింగళుణ్ణి చూస్తూనే,

మాటా మంతీ లేకుండా, శూలాన్ని గురిగా పింగళుడి గుండెలపైకి ఎత్తాడు. పింగళుడు నిర్భయంగా గుండెల మీద వున్న చొక్కాను పక్కకు తొలగించి, ''నేనెవరో తెలుసా? జాలరి పింగళుణ్ణి?'' అంటూ ముందుకు నడిచాడు. మరుక్షణం గుర్రంతో పాటు, రౌతు కూడా కుప్పలా భూమిలోకి కుంగిపోయాడు. పింగళుడు, యినుమడించిన ఉత్సాహంతో రెండవ ద్వారం దాటి మూడవ ద్వారాన్ని సమీంచాడు.



ఈ మూడవ ద్వారంముందు ఒక విలుకాడు బాణం ఎక్కుపెట్టి, పింగళుడికేసి చూస్తూ నిలబడి వున్నాడు. పింగళుడు తొణకకుండా ముందుకు నడుస్తూ, విలుకాడికి తన ఫాలభాగం వేలితో కొట్టి చూపించాడు. ఉత్తర క్షణంలో విలుకాడు పెద్దగా అరిచి పక్కకు పడిపోయాడు. పింగళుడు మూడవ ద్వారం దాటాడు.

నాలుగవ ద్వారాన్ని, పింగళుడు సమీపించనున్నంతలో భీకరమైన రంకెలు వినిపించినై. ద్వారానికి అటూ ఇటూ నిలబడి వున్న రెండు ఖడ్గమృగాలు తలలు వంచి, పింగళుడి మీదికి దూకేందుకు బుసలు కొడుతున్నవి. పింగళుడు చలించకుండా ముందుకు నడిచి, ఆ ఖడ్గమృగాలను రెండు చేతులతోనూ అంటుకున్నాడు. వెంటనే అవి రెండూ భగ్గుమని ఒక్కసారి మండి బూడిద కుప్పలా అయిపోయినై.

పింగళుడు అయిదవ ద్వారాన్ని సమీపించేసరికి, అక్కడ అతడికి కనబడిన వింతమృగం, అతడిలో భయానికన్న, ఆశ్చర్యం ఎక్కువ కలిగించింది. దాని శరీరం, వెనక కాళ్ళూ సింహాకృతిలో వున్నవి. తలా, ముందు కాళ్లు మాత్రం గద్దనుపోలి వున్నవి. "ఇది ఏమి మృగం?" అని పింగళుడు అనుకునేంతలో, ఆ గరుడ సింహం వెనక కాళ్ళమీద లేచి, రెక్కలు అల్లల్లాడిస్తూ, పింగళుడి మీదికి ఉరకబోయింది.

పింగళుడు, ఓ తృటికాలం నిశ్చేష్టుడై, అంతలోనే తెలివి తెచ్చుకుని, ''దారి తొలుగు! నేను జాలరి పింగళుణ్ణి!'' అంటూ ముందుకు అడుగు వేశాడు.

గరుడ సింహం ఠపీమని పేలి, తునా తునియలై పోయింది. పింగళుడు, దాని కేసి ఓమారు జాలిగా చూసి, అయిదవ ద్వారాన్ని దాటి, ఆరవ ద్వారాన్ని సమీపించాడు.

ఈ ఆరవ ద్వారం దాటగలిగితే, తను మహామాయుడి సమాధిలో ప్రవేశించ గలనన్న సంగతి గుర్తుకు రాగానే, పింగళుడికి పరమానందమయింది. ఉంగరం, వజ్రాలు తాపిన పిడిగల కత్తి, భూగోళం యీ మూడూ తనవి కానున్నవి!

పింగళుడు, అంతులేని ఉత్సాహంతో ఆరవ ద్వారాన్ని సమీపించాడు. అతడికి హఠాత్తుగా కన్ను చెదిరినట్టయింది. ఎదురుగా, ద్వారం పక్కన పద్మపాదుడు గద చేబూని నిలబడి వున్నాడు. పింగళుడు మైకం కమ్మిన వాడిలా ముందుకు అడుగు వేయబోయే సరికి, ''ఆగు! ఆగు! నువ్వెవరివి?'' అన్న భీకరమైన కంఠ స్వరం వినబడింది. ''నన్ను మోసపుచ్చేందుకు, ఏదో పిశాచి పద్మపాదుడి ఆకృతి దాల్చింది!'' అని పింగళుడు అనుకునేంతలో, ధగ ధగ మెరుస్తున్న గద, అతడి నేత్రాల ముందు కదిలింది. పింగళుడు, భయకంపితుడై వెనక్కు అడుగు వేశాడు.

''ఎవడో దొంగ, జాలరి పింగళుడు కాదు! బయటికి గెంటండి! దూరంగా విసిరివేయండి!'' అన్న కేకలు పింగళుడికి వినిపించినై. ఆ వెంటనే, అతడి వీపుమీదా, తలమీదా కర్రలతో, చేతులతో ఎవరో మోదసాగారు. ఒక్కొక్క ద్వారమే టక టకమని మూసుకో సాగింది. పింగళుడు భయంతో వణికిపోతూ, కళ్లు తెరిచేంతలో, అతడు గాలిలో ఎగిరిపోతున్నాడు. అతడి దృష్టి కిందకు మళ్ళింది. అక్కడ పద్మపాదుడు చేతులు చాచి, తను కిందపడకుండా పట్టుకునేందుకు సిద్ధంగా వున్నాడు. —(ఇంకావుంది)






# కలలప్రభావం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ నువ్వు పడుతున్న శ్రమకు కారణమేమిటో తెలియడం లేదు. ఎంతో జీవితానుభవం, వివేకంగల మనుష్యులు కూడా ఒక్కొక్కసారి విచిత్రంగా ప్రవర్తిస్తారు. ఇక అమాయకులా, అవివేకుల సంగతి చెప్పనే అవసరం లేదు. రాజైన వాడు ఎప్పుడూ తన రాజ్యవిస్తరణ కోసం ప్రయత్నించాలి. అలాగే వ్యాపారి ధనార్జన కోసం ఎప్పటికప్పుడు కొత్తమార్గాలు వెతుక్కోవాలి. అలాకానప్పుడు బలవంతుడైన మరొకరి వల్ల రాజూ, తెలివిమంతుడైన పోటీదారు కారణంగా వ్యాపారీ అపజయం

## బేతాళ కథలు



పాలవుతారు. ఇందుకు ఉదాహరణగా నీకు, స్నేహితుడి సలహా పాటించి కోట్లకు పడగలెత్త వలసిన శ్రీగుప్తుడనే వ్యాపారి తన అవివేక కారణంగా, వచ్చిన అవకాశాన్ని ఎలా జారవిడుచుకున్నదీ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

శ్రీగుప్తుడు ఒక చిన్న పట్టణంలో నగల వ్యాపారి. అతడికి రాజధానీ నగరంలో శ్రీకంఠుడు అనే చిన్ననాటి స్నేహితుడున్నాడు. ఈ శ్రీకంఠుడు నగరంలోని గొప్ప ధనికుల్లో ఒకడు, అతడికి సముద్ర వ్యాపారమున్నది. అతడొకసారి శ్రీగుప్తుణ్ణి చూడవచ్చాడు.

శ్రీగుప్తుడి నగల వ్యాపారం లాభసాటిగానే జరుగుతున్నదని శ్రీకంఠుడు తెలుసుకున్నాడు. కాని, తాను సముద్ర వ్యాపారంలో గడించే లాభాలతో దాన్ని పోల్చడానికి లేదు.

శ్రీకంఠుడు తన స్నేహితుడికి నగరంలో తనకున్న గొప్ప ఆస్తిపాస్తుల సంగతి చెప్పి, ''ఏవో లాభాలు వస్తున్నవన్న సంతృప్తి తప్ప, నువ్వు చేస్తున్న వ్యాపారం ఎదుగు బొదుగులు లేనిది. సముద్ర వ్యాపారం అలాంటిది కాదు. అందులో వచ్చే లాభాలతో కోట్లకు పడగలెత్తవచ్చు. నువ్వు ముందుగా కొంత అనుభవం గడించేందుకు, నా వ్యాపారంలో ఒక పదివేల వరహాలు పెట్టుబడి పెట్టి చూడు,'' అని సలహా యిచ్చాడు.

శ్రీగుప్తుడు, ''ఆలోచించి ఒక నిర్ణయానికి రావడానికి కొంత వ్యవధి కావాలి,'' అన్నాడు.

శ్రీకంఠుడు సరేనని నగరం వెళ్ళిపోయాడు. ఆ తరవాత కొద్దిరోజులకు శ్రీగుప్తుడు పదివేల వరహాలు తీసుకొని నగరానికి బయలుదేరాడు.

శ్రీగుప్తుడు చాలాదూరం నడిచి, మిట్టమధ్యాహ్నవేళ దారిపక్కన వున్న ఒక మామిడితోపులో విశ్రాంతి కోసం, ఒక చెట్టు నీడన పడుకున్నాడు. అతడికి ఎంతకూ

నిద్ర పట్టలేదు. నడుం కింద ఏదో పల్లేరుకాయ గుచ్చుకుంటున్నట్టు చాలా సేపు చీకాకుపడి, చిన్న కునుకు తీశాడు.

ఆ సమయంలో అతడి కొక కల వచ్చింది: అతనొక సముద్రపు ఒడ్డున వున్నాడు. తీరంలో నీళ్ళమీద తేలి యాడుతూ అతడికొక అందమైన ఓడ కనిపించింది. అది మొత్తం బంగారంతో నిర్మించడం వల్ల ధగధగ మెరిసిపోతు న్నది. వజ్రవైడూర్యాలు దానికి తోరణా లుగా వేళ్లాడుతున్నవి. ఓడలో మనుష లున్న సూచనలే లేవు. అలాంటి విలు వైన దాన్ని తన సొంతం చేసుకోవాలన్న ఆశతో శ్రీగుప్తుడు సముద్రంలోకి దూకి ఓడ కేసి ఈదుకు పోసాగాడు.

క్రమంగా అతడిలో శక్తి నశించిపోయి, కాళ్ళూ, చేతులూ ఆడించలేని స్థితికి వచ్చాడు. అలాంటి సమయంలో, ఒక వికృతాకారిణి అతడి రెండుకాళ్ళూ వడిసి పట్టుకున్నది.

ప్రాణభయంతో శ్రీగుప్తుడు, "ఎవరు నువ్వు? నన్నెందుకు పట్టుకున్నావు?" అని ఆ వికృతాకారిణిని అడిగాడు.

"నేను దరిద్రదేవతను. ఇంతకాలంగా నిన్ను పట్టుకోవడం నాకు సాధ్యపడ లేదు. ఈ తరుణంలో చిక్కావు." అంటూ దరిద్రదేవత వికటంగా నవ్వింది.



శ్రీగుప్తుడు దానిపట్టు వదిలించు కోవాలని నానా శ్రమా పడ్డాడు. కాని అది అతణ్ణి నీటికిందికి లాగేసింది. అతడు ఊపిరాడక గిలగిల తన్నుకుంటున్న దశలో మెలకువ వచ్చేసింది.

ఈ కలప్రభావం శ్రీగుప్తుణ్ణి హడలెత్తిం చింది. అతడు చెట్టుకింద నుంచి లేచి, సాయంత్రం వరకూ నడిచి, చీకటి పడే వేళకు, ఒక ఊరి సత్రం చేరుకున్నాడు. ఆ కలను గురించిన ఆలోచనలతో అత డికి రాత్రి నిద్ర పట్టలేదు. సముద్ర వ్యాపారంలో పెట్టుబడి పెట్టే ధనం గంగ పాలని, ఆ కల హెచ్చరించినట్టుగా అతడు భావించాడు. తెల్లవారుతూనే



''ఎవరు నువ్వు? నా దారికి అడ్డం రాకు,'' అన్నాడు శ్రీగుప్తుడు కోపంగా, ఆ స్త్రీ కేసి చూస్తూ.

ఆ స్త్రీ చిన్నగా నవ్వి, ''నేను అదృష్ట దేవతను. ఇంతకాలంగా ఏనాడూ పని గట్టుకుని, నీ దగ్గిరకు రావలసిన అవసరం కలగలేదు. ఇప్పుడు అవసరం వచ్చింది,'' అంటూ శ్రీగుప్తుడి చెయ్యిపట్టుకున్నది.

ఆ తరవాత అతడికి ఈదవలసిన శ్రమ తప్పింది. ఆమె అతణ్ణి ఓడ లోపలిభాగం లోకి తీసుకుపోయి, అదృశ్యమయింది. అక్కడ కనిపించిన దృశ్యం శ్రీగుప్తుడికి ఎక్కడలేని ఆశ్చర్యం కలిగించింది. అక్కడ వున్నది అచ్చు పట్టణంలోని తన నగల దుకాణమే! ఆ మరుక్షణం అతడికి మెలకువ వచ్చింది.

నగరం వెళ్ళే ఆలోచన మానుకుని, ఇంటికి తిరుగు ప్రయాణమయ్యాడు.

ఈసారి మంచి ఎండవేళకు అతడొక చెరువుగట్టు చేరి అక్కడున్న రావిచెట్టు కింద పడుకున్నాడు. చెరువు మీదినుంచి వచ్చే చల్లని గాలికి శ్రీగుప్తుడికి వెంటనే నిద్రపట్టింది. ఆ నిద్రలో కల! మరొక సారి సముద్రంలో వజ్రవైడూర్య తోరణా లతో మెరిసిపోతున్న బంగారు ఓడ కని పించింది. ఒడ్డున నిలబడి వున్న అతను దాన్ని చేరేందుకు సముద్రంలోకి ఉరి కాడు. అతడు ఓడకేసి ఈదుతూ అలిసి పోతున్న సమయంలో, ఒక అందమైన స్త్రీ ప్రత్యక్షమయింది.

శ్రీగుప్తుడు కొద్దిసేపు తనకు వచ్చిన కలను గురించి ఆలోచించి, లేచి చెరు వులో దిగి కాళ్ళూ, చేతులూ కడుక్కొని, యింటి మార్గం పట్టి నడవసాగాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, శ్రీగుప్తుడి ప్రవర్తన వింతగా లేదా? అతడు కలలో దరిద్రదేవత కనిపించినప్పుడూ సముద్ర వ్యాపారం వద్దనుకున్నాడు; అదృష్టదేవత కనిపించినప్పుడు కూడా వద్దనుకున్నాడు. భిన్నమైన రెండు కలల పట్లా అతడి నిర్ణయం ఒకటే కావడం,

ఆశ్చర్యంగా లేధా? దరిద్ర, అదృష్ట దేవత లిద్దరూ, అతడి అభిప్రాయంలో, సమాను లన్నట్టు కనబడుతున్నది. ఇంతకన్న మూర్ఖత్వం, అవివేకం మరెక్కడైనా వుంటుందా! అతడు స్నేహితుడి సలహాను పాటించక పోవడానికి కారణం, కలల ప్రభావం కాక, మరేదైనా కారణం వున్నదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సాధారణంగా మనిషి లౌకికజీవి. మనస్సును ఆశాదురాశ ల్లాంటివి పట్టిపీడిస్తున్నా, పరమ మూఢుల సంగతి ఏమోగాని - వివేకం వున్నవాడు, వాటిని అదుపులో వుంచుకుంటాడు. శ్రీగుప్తుడు సాధ్యాసాధ్యాలను తరచి చూడలేని కేవలం ధనాశాపరుడై వుంటే, తన బాల్యస్నేహితుడి సలహా గురించి ఆలోచించేందుకు వ్యవధి కావాలనే వాడు కాదు. సముద్ర వ్యాపారంలో కోట్లు గడిం చిన వాళ్ళతో పాటు, కొట్లు పోగొట్టుకున్న వాళ్ళు కూడా వుంటారనేది, శ్రీగుప్తుడి లాంటి వ్యాపారికి తెలిసిన సంగతే. మామిడి తోపులో కలలో కనిపించిన దరిద్రదేవతా, చెరువుగట్టున కలలో కనిపించిన అదృష్ట దేవతా—శ్రీగుప్తుడి మనసులో సాగుతున్న తర్కవితర్కాలకు ప్రతిరూపాలు. దరిద్రదేవత చేసిన పని అతడికి భయం కలిగించింది. అదృష్టదేవత అతణ్ణి బంగారు ఓడ లోపలికి చేర్చినప్పుడు, అక్కడ అతడి కంటబడింది, తన నగల దుకాణమే! అంటే, ఉన్నదానితో తృప్తి పడు; వంశపారంపర్యంగా సంక్రమించ డమేగాక, ఎంతో అనుభవం గడించిన నగల వ్యాపారాన్ని వదిలి, తెలియని వ్యాపారంలో ప్రవేశించకు అన్న సూచనా, హెచ్చరికా అందులో వున్నది. కనక, శ్రీగుప్తుడి నిర్ణయానికి కలల ప్రభావమే కారణం; మరే యితర కారణమూ లేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# దౌత్య వ్యవహారం

ధవళగిరి అనే ఒక పెద్ద రాజ్యానికి చేరువలో, హేమగిరి అనే రాజ్యం వుండేది. ఆ రెండు రాజ్యాల మధ్యా ఎన్నో సమస్యలుండి, అవి ఎప్పటికయినా యుద్ధానికి దారితీసే పరిస్థితులేర్పడ్డాయి. ధవళగిరి పాలకుడు ధనంజయుడు కావాలనుకుంటే సులభంగానే, హేమగిరిని జయించగలడు. అయినా, యీ పద్ధతి అతడికి యిష్టంలేదు. తను యుద్ధం చేసి, హేమగిరిని ఆక్రమించుకుంటే, పొరుగున వున్న యితర రాజ్యపాలకులకు అది కన్నెర్ర కావడమేకాక, ఆ రాజ్యం అనుకోని విధంగా ఎందరో సానుభూతిపరుల్ని సంపాయించుకుంటుంది.

ధనంజయుడు యిలా ఆలోచించి, తమ రాజ్యాల మధ్య వున్న సమస్యలను సంప్రతింపుల ద్వారా పరిష్కరించుకోవడానికి సిద్ధమే అనీ, ఒకవేళ ఆ సంప్రతింపులు సఫలం కాని పక్షంలో యుద్ధం తప్పదనీ, నలుగురికీ తెలిసేలా ప్రకటించాడు. తరవాత ఒక లేఖద్వారా తన షరతులన్నీ హేమగిరి రాజు హిరణ్యవదనుడికి అందజేశాడు.

హిరణ్యవదనుడి మంత్రి మహేశ్వరుడు, ఆ లేఖచదివి రాజుతో, "మహారాజా, ఈ లేఖ ధనంజయుడి రాజకీయ చతురతకు మచ్చుతునక. ఇందులోని అంశాలన్నీ బాగా పరిశీలించి చూసినట్లయితే, ఆయన సంప్రతింపుల పేరిట, తన షరతుల మేరకే మనతో ఒప్పందం కుదుర్చుకోవాలని ఎత్తువేసినట్లు తెలిసిపోతుంది," అన్నాడు.

"అవును, ఆయన ఎత్తుగడ అదే!" అన్నాడు హిరణ్యవదనుడు.

"మనం యుద్ధంచేసే స్థితిలో లేమని ఆయన ఎరుగు. సంప్రతింపులకు మనం

జొన్నలగడ్డ రత్న

ఒప్పుకోకపోతే, ఆయన మరుక్షణంలో మనపై దండెత్తి రాగలడు. మనకు తగిన అవకాశం యిచ్చాకనే, తానాపని చేశాడని న్నలుగురూ అనుకునేందుకు, ఈ సంప్రతింపుల వ్యవహారం సృష్టించాడు,'' అన్నాడు మంత్రి.

''అయితే, అతడితో సంభాషణలు ప్రారంభించక తప్పదా?'' అని అడిగాడు హిరణ్యవదనుడు.

మంత్రి అలా చేయకతప్పదని రాజుతో చెప్పి, ''ఇందుకు తగిన వ్యక్తిని మనం పంపవలసి వుంటుంది,'' అన్నాడు.

''అలాంటి వ్యక్తి, మీ దృష్టిలో ఎవరైనా వున్నారా?'' అన్నాడు హిరణ్యవదనుడు.

అందుకు మంత్రి, ''మన పురోహితుడు పుష్కరుడు మంచి వక్త, తన వాగ్ధాటితో ఎంతటి మేధావులనైనా ఆకట్టుకో గలడు. ఆయన్ని, మన తరఫున యీ సంప్రతింపులకు పంపడం బావుంటుందని, నా అభిప్రాయం,'' అన్నాడు.

హిరణ్యవదనుడు చిన్నగా నవ్వి, ''తాడెక్కేవాణ్ణి తలదన్నే వాడుంటాడు! ధనంజయుడి ఆస్థానకవి అపూర్వుడి సంభాషణా చతురత ఎంతటిదో, మనం కూడా కథలుగా వింటూనే వున్నాం. మనం పుష్కరుణ్ణి దూతగా పంపిన పక్షంలో, ధనంజయుడు ఆయనను తన పక్షాన



దూతగా నియమించే అవకాశం వున్నది. అందుచేత, మాటల గారడీల వల్ల, ఇలాంటి వ్యవహారాల్లో నెగ్గుకు రాలేమని, నా కనిపిస్తున్నది,'' అన్నాడు.

మంత్రి కొంచెం సేపు ఆలోచించి, ''రాజకీయ ప్రాధాన్యత వున్న యిలాంటి సంభాషణ జరిపేటప్పుడు పట్టూ, విడుపూ; యిచ్చుకోవడం, పుచ్చుకోవడం అవసరంఅంటారు. నిరంజనుడు మన నగరంలో ప్రముఖ వ్యాపారస్తుడు; మంచి వ్యవహార దక్షతకలవాడు. అతణ్ణి దూతగా పంపడంబావుంటుందంటారా?'' అన్నాడు.

దానికి రాజు ''మన ప్రస్తుత బలహీనతలు ఎరిగివున్న ధనంజయుడు ఎన్నో

ఒత్తిడులు మనపైతీసుకురావడానికి ప్రయత్నిస్తాడు. డబ్బుపరంగా లాభనష్టాలు తప్ప, మరేం పట్టించుకోని వర్తకుడు వాటిని తట్టుకుని దృఢ వైఖరి అవలంబిస్తాడన్న నమ్మకం నాకు లేదు,'' అన్నాడు.

పక్కనేవుండి, యీ సంభాషణ అంతా వింటున్న విదూషకుడు వినోదుడు, రాజుతో, ''మహారాజా! పుష్కరుడూ, నిరంజనుడూ యీ దౌత్యవ్యవహారానికి సరైనవారు కారని మీరనుకుంటే, నాకీ అవకాశం ఎందుకివ్వకూడదు?'' అన్నాడు.

ఆ మాటలకు మంత్రి హేళనగా, ''ఇదేమైనా నవ్వులాట వ్యవహారం అయితే, మహారాజుగారు నిన్నే దూతగా పంపి వుండేవారు,'' అన్నాడు.

హిరణ్యవదనుడు ఏదోగుర్తుకు వచ్చిన వాడిలా తల పంకించి, వినోదుడితో, ''ధవళగిరికి దూతగా వెళ్ళడానికి, నువ్వు అర్హుడివి! ఒకటి, రెండు రోజుల్లో బయలుదేరి వెళ్ళేందుకు అవసరం అయిన ఏర్పాట్లు చేసుకో,'' అన్నాడు.

రాజు యిలా అనగానే మంత్రి మహేశ్వరుడు ఆశ్చర్యంగా ఆయన కేసి చూశాడు. అప్పుడు రాజు, ''వినోదుడి సంభాషణా నైపుణ్యం బాగా ఎరిగిన వాణ్ణి గనకనే అతణ్ణి దూతగా పంపుతున్నాను. ఎదిరి పక్షంతో ఏవిధంగానూ ఏకీభవించకుండా వుంటూనే, సంభాషణలు మాత్రం భగ్నం కాకుండా, సుదీర్ఘంగా సాగించే నేర్పు అతడికున్నది,'' అన్నాడు.

వినోదుడు ధవళగిరికి వెళ్ళి సంభాషణలు ప్రారంభించాడు. అవి అలా కొనసాగుతూనే వున్నవి. ఈ లోగా, ఒకవేళ ధనంజయుడు యుద్ధానికి సిద్ధపడితే, ఆ పరిస్థితిని ఎదుర్కొనేందుకు హిరణ్యవదనుడు అవసరం అయిన ఏర్పాట్లు చేసుకుంటున్నాడు. ధనంజయుడు సంభాషణలను భగ్నం చేయలేదు, యుద్ధానికీ సిద్ధపడలేదు. విదూషకుడు వినోదుడు మాత్రం ఆయన కొలువులో హేమగిరి నుంచి వచ్చిన శాశ్వత రాయబారిగా నిలిచిపోయాడు.



# పరమశుంఠ!

ఆనాటి పండితులందరికన్న గొప్పవాడని ఖ్యాతి పొందిన శివసూరి అనే వృద్ధ పండితుడు, ఒకానొక గురుకుల యాజమాన్యం ఆహ్వానించగా అక్కడ ఉపన్యసించేందుకు వచ్చాడు. ఆయన ఆధ్యాత్మిక విషయాల గురించి ఒక గంటసేపు ఉపన్యసించి విద్యార్థులతో, "నేను మాట్లాడిన దాన్ని గురించి, మీ అభిప్రాయం ఏమిటో ఒక వాక్యంలో రాసి యివ్వండి," అన్నాడు.

విద్యార్థులంతా ఎవరికి తోచిన అభిప్రాయం వాళ్ళు, ఒక తాళపత్రం మీద రాసి పండితుడి కిచ్చారు. అందులో ఒకదాని మీద 'పరమశుంఠ' అని రాసి వుంది.

శివసూరి ఆ తాళపత్రాన్ని విద్యార్థుల కేసి చూపుతూ, "నేను లోగడ ఎన్నో గురుకులాల్లో ఉపన్యసించాను. చాలా సందర్భాలలో విద్యార్థులు తమ అభిప్రాయాలు రాసి, కింద సంతకం పెట్టడం మరిచారు. కాని, యిది నాకు వింత అనుభవం! ఈ విద్యార్థి ఎవరో పత్రం మీద తన పేరు మాత్రం రాసి, అభిప్రాయం రాయమరిచాడు," అన్నాడు.

పరమశుంఠ అని రాసిన విద్యార్థి సిగ్గుతో తల వంచుకున్నాడు. —ఎం. డి. సౌజన్య






అరుణగిరి నగరాన్ని పాలించే ప్రతాపసేన మహారాజుకు, ఉన్నట్టుండి ఏదో తెలియని జబ్బుచేసి మాట పడిపోయింది. ఆ కారణం వల్ల యువరాజు ప్రసేనుడు అర్ధాంతరంగా రాజు కావలసి వచ్చింది.

ప్రసేనుడికి లోకజ్ఞానం శూన్యం. అయితే, మంత్రి బాదరాయణుడు ఎంతో తెలివైనవాడు. ఆయన సలహాలూ, సూచనలూ పాటిస్తూ, ప్రసేనుడు అద్భుతంగా రాజ్యపాలన నిర్వహిస్తూ, తండ్రి కంటె ఎక్కువ పేరు తెచ్చుకున్నాడు.

ఈలోగా మహారాజు ప్రతాపసేనుడి వ్యాధి నయమైపోయింది. కుమారుడు ఎంతో చక్కగా రాజ్యపాలన చేయడం గమనించి, ఆయన మరికొంత కాలం విశ్రాంతి తీసుకోదలిచాడు.

అంతా సక్రమంగా జరిగిపోతున్న సమయంలో, దురదృష్టవశాత్తూ మంత్రి బాదరాయణుడు మరణించాడు. మంత్రి లేనిదే తనకు ఒక్క క్షణం కూడా గడవదని తెలిసిన ప్రసేనుడు, వెంటనే కొత్త మంత్రిని ఎన్నుకునేందుకు సిద్ధపడ్డాడు.

ప్రతాపసేనుడు మంత్రి ఎన్నికలో కుమారుడికి సాయపడా లనుకున్నాడు. కానీ, ప్రసేనుడు తండ్రితో, "మంత్రిలేనిదే రాజ్యపాలనచేసే తెలివి, నాకులేదు. కానీ, నాకు కావలసిన మంత్రిని ఎన్నుకునే తెలివిమాత్రం, నాకున్నది!" అన్నాడు.

"మంత్రి పదవికోరి వచ్చిన వాళ్ళకు, నీవు పెట్టబోయే పరీక్ష ఎలా వుంటుందో చూస్తాను," అని పరీక్షసమయంలో కొడుకు పక్కన కూర్చున్నాడు, ప్రతాపసేనుడు.

మంత్రి కావాలని వచ్చిన ప్రతిఒక్కడూ తన దగ్గిరకు రాగానే ప్రసేనుడు, అతణ్ణి, "రెండయిదు లెంత?" అని అడుగు

శ్రీరామకమల్

తున్నాడు. వాడు పది అని చెప్పగానే బయటకు పంపేస్తున్నాడు. కొడుకు వేస్తున్న ప్రశ్నలో ఏదో కీలకమున్నదని ప్రతాపసేనుడు భావించాడు.

చనిపోయిన మంత్రి బాదరాయణుడికి సౌగంధరాయణుడనే కొడుకున్నాడు. తెలివితేటల్లో అతడు తండ్రిని మించిన వాడు. ప్రసేనుడు మూర్ఖుడని అతనికి తెలుసు. ఆయన ఎలాంటి ప్రశ్నవేస్తాడో ముందుగానే తెలుసుకునేందుకు సౌగంధరాయణుడు తన సేవకుడిని పంపాడు.

ఈ విధంగా అతడికి ప్రశ్న ఏమిటో తెలిసిపోయింది. అప్పుడు సౌగంధరాయణుడు ప్రసేనుడి వద్దకు వెళ్ళి, ప్రశ్నవిని, ''రెండయిదులు ఏడు, ప్రభూ!'' అన్నాడు.

ప్రసేనుడు సంతోషంగా, ''అయితే, నువ్వే, నా మంత్రివి!'' అన్నాడు.

''మహాప్రభూ, తమరు వేసే ప్రశ్న ముందుగా తెలిసిన కారణంగానే, నేను జవాబు చెప్పగలిగాను. కానీ, రెండయిదులు పది ఎందుకు కాదో, తమరొక్కరే చెప్పగల సమర్థులని, నా అభిప్రాయం,'' అన్నాడు సౌగంధరాయణుడు.

ప్రసేనుడు దిగులుగా, ''అయితే, రెండయిదులు పదని, నీకూ తెలుసునన్న మాట! మంత్రిపదవికి నువ్వు అర్హుడివి కావు,'' అని అతణ్ణి పంపేశాడు.

ఇదంతా చూస్తున్న ప్రతాపసేనుడు కుమారుడితో, ''ఈ ప్రశ్న వేయడంలో నీ ఉద్దేశమేమిటి?'' అన్నాడు.

"నాన్నగారూ, బాదరాయణ మంత్రి ఎంతో తెలివైనవాడు. ఎక్కాలు బాగా వచ్చినంత మాత్రాన ఎవరూ గొప్ప మంత్రులు కాలేరని, ఆయన అంటూండే వాడు. ఆయనకు లెక్కలు అంతగా రావని, నా నమ్మకం. మళ్ళీ అలాంటి మంత్రే నాకు కావాలి,'' అన్నాడు ప్రసేనుడు.

కుమారుడి తెలివి ప్రతాపసేనుడికి అర్థమయింది. ఆయన అప్పటికప్పుడు సౌగంధరాయణుడిని పిలిపించి, స్వయంగా అతడి తెలివితేటల్ని పరీక్షించి ప్రసేనుడికి మంత్రిగా నియమించాడు.





# కృతఘ్నుడైన రాజు

కాశీరాజ్యాన్ని పాలించే బ్రహ్మదత్తుడికి ఒక కుమారుడుండేవాడు. అతడు చిన్నతనం నుంచీ బహు క్రూరస్వభావుడు. ఏ కారణం లేకుండానే దారేపోయే వాళ్ళను భటులచేత పట్టించి, నానా హింసలపాలు చేసి ఆనందించేవాడు. వృద్ధులపట్లా, పండితులపట్లా చిన్నమెత్తు గౌరవభావం లేకపోగా, అనవసరంగా వాళ్ళను అవమానిస్తూండేవాడు. ఈ కారణాల వల్ల, యువరాజన్న గౌరవభావం అతడి పైన ఎవరికీ వుండేది కాదు. అందరూ అతణ్ణి అసహ్యించుకునేవారు.

అతడు ఇరవై ఏళ్ళ వయసువాడై వుండగా, కొందరు స్నేహితులతో కలిసి నదికి స్నానానికి వెళ్ళాడు. అతడికి ఈత రాదు. అందువల్ల గజ యీతగాళ్ళయిన కొందరు నౌకర్లను వెంట తీసుకుపోయాడు.

యువరాజూ, అతడి స్నేహితులూ నదిలో స్నానం చేస్తూండగా, హఠాత్తుగా ఆకాశాన్ని మేఘాలు కప్పివేసినై. ఉరుములూ, మెరుపులతో జడివాన ప్రారంభమయింది. అది చూసి యువరాజు పట్టలేని ఆనందంతో చప్పట్లు చరిచి నౌకర్లతో, "ఇలాంటి సమయంలో నది మధ్య స్నానం చేయడం చాలా బావుంటుంది. నన్ను అక్కడికి తీసుకుపొండి," అన్నాడు.

నౌకర్లు యీ ఆజ్ఞ వింటూనే నదిలోకి దిగి, యువరాజును నది మధ్యకు తీసుకుపోయారు. అతడి స్నేహితులు గట్టు దగ్గిర అంతగా లోతులేని నీళ్ళలో వుండిపోయారు. ఉన్నకొందికీ వాన అధికం కాసాగింది. దానికితోడు కొద్ది గజాల దూరంలో ఏమున్నదీ కానరాకుండా, అంతటా చీకటి అలముకున్నది.

నౌకర్లకు దుష్టుడైన యువరాజు మీద పగతీర్చుకునేందుకు, యిది మంచి సమయంగా తోచింది. వాళ్ళు అతణ్ణి నది మధ్య వదిలి, వేగంగా ఒడ్డుకు ఈదుకు పోయారు.

"యువరాజే మయ్యాడు?" అని అతడి స్నేహితులు నౌకర్లను అడిగారు.

"ఆయన, మా చేతుల పట్టు వదిలించుకుని, ఈదుతూ వెళ్ళాడు. బహుశా, వెంటనే రాజభవనానికి వెళ్ళాలన్న కోర్కె కలిగి వుంటుంది," అని జవాబు చెప్పారు నౌకర్లు.



అందరూ తిరిగి వచ్చాక, రాజు తన కొడుకును గురించి నౌకర్లను అడిగాడు. వాళ్ళు, అతడి స్నేహితులకు యిచ్చిన జవాబే యిచ్చారు. వెంటనే రాజు సైనికులను పిలిచి, నదీ ప్రాంతాలన్నీ యువరాజు కోసం వెతకమన్నాడు. వాళ్ళు నడిరేయి వరకూ అంతా గాలించి, యువరాజు జాడలేదని రాజుకు చెప్పారు.

అయితే, యువరాజు మరణించలేదు. ప్రవాహ వేగానికి అతడు మునుగుతూ, తేలుతూ కొట్టుకుపోతూండగా, అదృష్టవశాత్తూ అతడికి నీటివాలున పడి తేలుతూ వస్తున్న ఒక చెట్టు కొమ్మ దొరికింది. దాని ఆధారంతో అతడు ప్రాణరక్షణ చేసుకున్నాడు. అయితే, ఆ కొమ్మ మీద అప్పటికే మూడు ప్రాణులున్నవి; అవి ఒక పాము, ఎలుకా, చిలుకా.

యువరాజు అంత తుఫాను హోరులోనూ మధ్య, మధ్య పెద్దగా గొంతెత్తి, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టసాగాడు.

ఈ విధంగా, కొమ్మతోపాటు యువరాజు నదీ జలంలో కొట్టుకుపోతూండగా సూర్యాస్తమయకాలం అయింది. ఆ సమయంలో నది ఒక అరణ్యంగుండా ప్రవహిస్తున్నది. సాధువుగా జన్మించి, నది ఒడ్డున ఆశ్రమంలో తపస్సు చేసుకుంటున్న బోధిసత్వుడు, యువరాజు కేకలు విన్నాడు.



అయన దృఢకాయుడు; ధైర్యశాలి. వెంటనే అంత తుఫాను మధ్య బోధి సత్వుడు నదిలో దిగి, ఈదుకుంటూ పోయి, కొమ్మను తీరానికి లాక్కువచ్చాడు. తరవాత యువరాజుతోపాటు వున్న మూడు ప్రాణుల్నీ తన కుటీరానికి తీసుకుపోయి, చలిమంట వేసి, భోజనం తయారుచేశాడు. ఆయన ముందుగా అల్పజీవులైన పామూ, ఎలుకా, చిలుకలకు ఆహారం పెట్టి, యువ రాజు భోజనం ముగించాక పక్క ఏర్పాటు చేశాడు.

ఈ విధంగా వాళ్ళు రెండు రోజులు బోధిసత్వుడికి అతిథులుగా వున్నారు. ఈ లోపల తుఫాను తగ్గిపోయింది. యువ రాజుతోపాటు, మూడు ప్రాణులూ తిరిగి స్వస్థత చెందాయి.

చిలుక అక్కడనుంచి తన నివాసానికి బయలుదేరుతూ బోధిసత్వుడితో, "అయ్యా, తమరు నా ప్రాణదాతలు. నది పక్కన వున్న ఒక చెట్టుతొర్ర, నా నివాసస్థానం. తుఫాను తాకిడికి అది నదిలో పడిపోయింది, నేను ఎగరలేక పోయాను. నాకు హిమాలయాల్లో చాలా మంది మిత్రులున్నారు. మీకు ఏనాడైనా అవసరం కలిగితే, నదికి ఆవలనున్న పర్వతపాదం దగ్గిర నిలబడి, నన్ను పిల వండి. నా మిత్రులచేత మీకు అపూర్వ మైన ధాన్యాలూ, ఫలాలూ తెప్పించి యివ్వగలను," అన్నది.

"నీ వాగ్దానం గుర్తుంచుకుంటాను!" అన్నాడు బోధిసత్వుడు.

పాము, బోధిసత్వుడితో, "నేను పూర్వ జన్మలో ఒక వర్తకుణ్ణి. కొన్ని కోట్ల బంగారు నాణేలను నది గట్టున ఒకచోట గుప్తపరిచాను. ఆ బంగారం మీది వ్యామోహం వల్ల, యీ జన్మలో యిలా పామునై పుట్టాను. నా జీవితం ఆ నిధిని కాపాడడంతో గడిచిపోతున్నది. ఆ బంగా రాన్ని తమరు ఏదైనా నలుగురికీ ప్రయో జనకరంగా ఉపయోగించగలిగితే, దాన్ని తమ పరం చేస్తాను," అన్నది.

ఆ తరవాత ఎలుక కూడా తనను గురించి చెప్పుకున్నది. బోధిసత్వుడు ఆ మూడింటినీ భవిష్యత్తులో తిరిగీ కలుసుకుంటానన్నాడు.

యువరాజు, బోధిసత్వుడితో, "ఏదో ఒకనాడు నా తండ్రి తరవాత నేను కాశీ రాజ్యానికి రాజునవుతాను. అప్పుడు మీరు నగరానికి రండి. తమను సకల మర్యాదలతో ఆహ్వానించగలను," అన్నాడు.

కొన్ని సంవత్సరాల తరవాత బోధిసత్వుడు కాశీకి వెళ్ళాడు. అప్పటికి బ్రహ్మదత్తుడు చనిపోయి యువరాజు సింహాసనానికి వచ్చాడు.

బోధిసత్వుడు నగరం చేరి, రాజవీధిన నడుస్తూండగా, ఏనుగు అంబారీలో షికారు పోతున్న అతడు, బోధిసత్వుణ్ణి చూస్తూనే, తన అంగరక్షకులతో, "ఆ సాధువును వెంటనే పట్టుకుని స్తంభానికి కట్టి, కొరడాలతో గట్టిగా కొట్టండి. ఆ పైన వధ్యస్థానానికి తీసుకుపోయి, తల నరకండి. వీడికి ఎంత పొగరంటే—అప్పట్లో యువరాజైన నన్ను కాదని, నా కంటె ఎక్కువగా ఒక పాముకూ, ఎలుకకూ, చిలుకకూ సేవలు చేశాడు," అన్నాడు.

ఇలా రాజాజ్ఞ కాగానే అంగరక్షకులు బోధిసత్వుణ్ణి పట్టుకుని కొరడాలతో కొట్టసాగారు. అది చూసిన ప్రజలు బోధిసత్వుణ్ణి, "అయ్యా, తమరేనాడైనా, యీ రాజుకు ఉపకారం చేశారా?" అని అడిగారు.



"అవును, చేశాను!" అని బోధిసత్వుడు జరిగినదంతా చెప్పాడు.

కాశీరాజ్య ప్రజలు యీ కొత్త రాజు పాలనలో నానా హింసలకూ, అవమానాలకూ గురవుతున్నారు. ఇంతకాలంగా రాజుపట్ల వాళ్ళకున్న మితిమీరిన ద్వేషం, బోధిసత్వుణ్ణి అతడి అంగరక్షకులు హింసించడం చూసేసరికి భగ్గుమన్నది. వాళ్ళు చేతికందిన ఆయుధాలు తీసుకుని అంగరక్షకులపైబడి, వాళ్లను తరిమివేసి, బోధిసత్వుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశారు.

దుష్టుడైన రాజు ప్రజల ఆగ్రహం చూసి, అక్కడినుంచి పారిపోవాలని ప్రయత్నించాడు. కాని, ప్రజలు అతణ్ణి తరిమి ఏనుగుపై నుంచి కిందికి పడదోసి చంపివేశారు.

ప్రజల కోరికపై బోధిసత్వుడు, వాళ్లకు రాజై ధర్మం తప్పకుండా రాజ్యపాలన చేశాడు. ఆయన పామునూ, ఎలుకనూ, చిలుకనూ మరిచిపోలేదు. ఒకసారి అరణ్యానికి పోయి అక్కడ పామునూ, ఎలుకనూ కలుసుకున్నాడు. అవి తమ నిధి నిక్షేపాలను స్వీకరించవలసిందిగా ఆయనను కోరినై.

బోధిసత్వుడు ఆ కోర్కెను కాదనలేక ధనంతోపాటు వాటిని కూడా నగరానికి తీసుకు వచ్చాడు. చిలుకను కూడా కలుసుకుని, దాన్ని కూడా తన వెంట రావలసిందిగా ఆహ్వానించాడు.

ఆయన ప్రజల క్షేమం కోసం నిధిని ఖర్చుపెట్టటమే గాక, పాము నివసించేందుకు రాజప్రాసాదం పైన ఒకచోట బంగారంతో చిన్న సొరంగం ఏర్పాటు చేశాడు. దానితోపాటు ఎలుక వుండేందుకు మణిమాణిక్యాలు తాపడం చేసిన ఒక పెద్ద కలుగూ, చిలుకకు ఒక బంగారు పంజరం తయారు చేయించాడు.

ఈ విధంగా కృతఘ్నుడూ, దుష్టుడూ అయిన రాజు పోయి, కాశీరాజ్య ప్రజలకు ధర్మస్వరూపుడైన బోధిసత్వుడు రాజుగా దొరకడంతో, వాళ్ళు ఎంతోకాలం, సుఖంగా జీవించారు.





# ఔరంగజేబు

దారా, సుజా, ఔరంగజేబు, మురాద్ అనే నలుగురు కొడుకులలో పెద్దవాడైన దారా, తన అనంతరం మొగల్ సింహాసనాన్ని అధిష్ఠించాలని షాజహాన్ ఆశించాడు. దారా గొప్ప పండితుడు; వేదాలను, ఉపనిషత్తులను ఆయన పర్షియాభాషలోకి అనువదించాడు.

1657వ సంవత్సరంలో షాజహాన్ జబ్బు పడ్డాడు. ఆ సమయంలో అతని కోర్కెను నెరవేర్చడానికి దారా మాత్రమే దగ్గర వున్నాడు. మిగతా ముగ్గురు కొడుకులూ, రాజ్యంలో మూల కొకరు రాజ ప్రతినిధులుగా వున్నారు. తండ్రి మరణించనున్నాడని తెలియగానే, ముగ్గురు కొడుకులూ ఎలాగైనా రాజ్యాధికారాన్ని చేపట్టాలని పథకాలు వేయసాగారు.





అంతవరకూ బెంగాల్‌లో రాజప్రతినిధిగా వున్న సుజా తన్ను తాను రాజుగా ప్రకటించుకుని సైన్యాన్ని ఆగ్రా మీదికి నడిపించాడు. షాజహాన్ ఆజ్ఞానుసారం, దారా కుమారుడు సులైమాన్‌సికో చిన్నాన్న సైన్యాన్ని ఎదుర్కొనడానికి బయలుదేరాడు. వారణాసి వద్ద యుద్ధం జరిగింది. సుజా ఓడిపోయి బెంగాల్‌కు వెనుదిరిగిపోయాడు.



ఆ సమయంలో దక్కనులో వున్న ఔరంగజేబు, సోదరుడైన మురాద్‌ను కలుసుకుని, ఇద్దరూ కలిసి మిగతా ఇద్దరినీ చంపి, రాజ్యాన్ని సమంగా పంచుకుందామన్న పథకం చెప్పాడు. అమాయకుడైన మురాద్ అందుకు అంగీకరించాడు. ఇద్దరూ కలిసి దారా మీద దాడి చేశారు.

ఉభయ సైన్యాలూ, దారా సేనలను ఆగ్రా సమీపంలోని సముఘర్ ప్రాంతంలో ఎదుర్కొన్నాయి. రాజ పుత్రులు దారా పక్షం వహించి పోరా డారు కాని, దారా ఎక్కిన ఏనుగు గాయ పడడంవల్ల దారా దానిమీది నుంచి కిందపడ్డాడు. ఆ దృశ్యం చూసిన అతని సైనికులు దారా మరణించా డన్న భయంతో చెల్లాచెదరై పోయారు.





ఔరంగజేబు ఆగ్రా కోటను చుట్టు ముట్టాడు. అది మండు వేసవికాలం. కోట లోపలికి నీటి సరఫరా లేకుండా చేశాడు ఔరంగజేబు. రోగగ్రస్తుడైన రాజుకు సైతం నీరు కరువయింది. దాహంతో సైనికులు, శత్రుసేన లతో పోరాడలేకపోయారు. కోట పతన మయింది.

కోట లోపలికి విరుచుకుపడ్డ ఔరంగజేబు, తండ్రిని పదవీభ్రష్టుని చేసినట్టు చెప్పాడు. షాజహాన్ అక్కడి నుంచి ఎటూ కదలలేక పోయాడు. ఆయన కోటలోనే ఖైదు చేయబడ్డాడు.





ఔరంగజేబు, ఆగ్రా నుంచి ఢిల్లీ మీదికి సైన్యాన్ని నడిపించాడు. తండ్రినీ, అన్ననూ జయించడంలో తనతో చేయి కలిపిన తమ్ముడు మురాద్‌ను, మార్గ మధ్యంలో మధురలో ఖైదు చేసి, చంపించాడు. భయంకరమైన ఈ ద్రోహం అందరికీ దిగ్భ్రాంతి కల్గించింది.

ఢిల్లీని చేరగానే ఔరంగజేబు, తనను చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు. అలంఘీర్ (ప్రపంచ విజేత) అన్న బిరుదు ధరించిన ఔరంగజేబు, మొగల్ సామ్రాజ్య విస్తరణకు పాటుపడ్డాడు. అయినా అతనిలోని మత దురభిమానం, పరమత ద్వేషం, నిత్యశంక మొదలైన దుర్గుణాలవల్ల, మొగల్ సామ్రాజ్య పతనానికి కారకుడయ్యాడు.





వాయువ్య సరిహద్దు ప్రాంతాలకు తప్పించుకుని పారిపోయిన దారా, తన మిత్రుడు జివాన్‌ఖాన్ ఇంట తలదాచుకున్నాడు. మత గ్రంథాలు చదువుకుంటూ ప్రశాంతంగా కాలం గడపసాగాడు. కాని, ఔరంగజేబు అభిమానం సంపాదించడానికి, జివాన్‌ఖాన్, దారాను అతనికి అప్పగించాడు. దారా చంపబడ్డాడు.

అరకాన్ కొండలకు పారిపోయిన సుజా జాడ మరల కనిపించలేదు. బహుశా అరకానులే అతణ్ణి హతమార్చి వుంటారని చెబుతారు. దారా కొడుకు సులైమాన్ విషప్రయోగంతో చంపబడ్డాడు. అఖరికి ఔరంగజేబు, తనతో రాజ్యసింహాసనానికి పోటీపడే వాళ్ళు లేకుండా చేసుకున్నాడు.







ఇంతచేసీ ఔరంగజేబుకు మనశ్శాంతి కరువయింది. కోటలో సైతం అతడు ఏ ఒక్కరినీ నమ్మలేకపోయాడు. ఆయనపట్ల అభిమానం చూపేవారు లేకపోయారు. అచిరకాలంలోనే రాజ్యమంతటా తిరుగుబాట్లు తలెత్తసాగాయి. మధుర ప్రాంతంలోని జాట్ రైతులు ఔరంగజేబు అధికారానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు!



# ఖరీదైన పాఠాలు

బొగ్దాదు నగరానికి సమీపంలోని, కెర్మాన్‌షా పట్టణంలో, ఉమర్ అనే తిరుగుబోతు వుండేవాడు. వాడు పేరుమోసిన మోసకారి. ఆ సంగతి పట్టణంలోని చాలా మందికి తెలుసు. వాడు పైకి ఎంతో పెద్ద మనిషిలా, మర్యాదస్థుడిలా కనబడుతూ, తన మాటకారితనంతో జనాన్ని వంచిస్తూండేవాడు.

ఉమర్ వుండే పట్టణానికి వర్తకపు పనులమీద, బాగ్దాదు నుంచి ముస్తఫా అనే యువ వర్తకుడు వస్తూండేవాడు. అతడు చాలా తెలివితేటలూ, చొరవా కలవాడే కాని, పొగడ్తలకు యిట్టే పొంగిపోతూండేవాడు.

ఉమర్, యీ వర్తకుడితో పరిచయం చేసుకోదలచి, ఒకనాడు బజారులో అతణ్ణి కలుసుకుని, "మీరు వర్తకుల్లో రాజులాంటివారు! మీ తండ్రీ, తాతా, తాతగారి తాతా—ఒకరేమిటి? అందరూ గొప్ప వంశంలో పుట్టినవారని, మీ రూపం చూస్తేనే తెలుస్తుంది," అన్నాడు.

ఈ పొగడ్తకు ముస్తఫా ఎంతగానో మురిసిపోయాడు. ఉమర్ తరచు అతణ్ణి యిలాంటి పొగడ్తలతో సంతోషపరుస్తూ, క్రమంగా అతడికి మిత్రుడయ్యాడు. మిగతా వర్తకులు ముస్తఫాకు, ఉమర్ పెద్ద మోసకారి అని చెప్పి చూశారు. కాని, అతడికా మాటలేవీ రుచించలేదు. అతను బాగ్దాదు నుంచి, కెర్మాన్‌షా పట్టణానికి వచ్చినప్పుడల్లా, ఉమర్ అతణ్ణి కలుసుకుంటూండేవాడు.

ఒకనాడు ఉమర్ బాగ్దాదు నగరం వెళ్ళి, ముస్తఫాను కలుసుకున్నాడు. వర్తకుడు వాడి రాకకు సంతోషించి, "మిత్రమా, నన్ను చూసేందుకు శ్రమకోర్చి చాలా దూరప్రయాణం చేశావు.

అరేబియా కథ



కొన్నాళ్ళపాటు యిక్కడ, నా అతిథిగా వుండాలి,'' అన్నాడు.

ఈ మాటలకు మోసకారి ఉమర్ లోలోపల చాలా సంతోషించి, పైకి ఎంతో బాధపడుతున్నవాడిలా ముఖం పెట్టి, ''నువ్వు, గత రెండేళ్ళుగా కెర్‌మాన్‌షాకు రాలేదు. బెంగపడిపోయి, బయలుదేరి వచ్చాను,'' అన్నాడు.

ఉమర్ యిలా అనేసరికి ముస్తఫాకు ఎక్కడలేని ఆనందం కలిగింది. అతడు మోసకారికి గొప్పగా అతిథిమర్యాదలు జరిపి, తన ఖాతాదారులకూ, తోటి వర్తకులకూ ఉమర్‌ను మంచి మిత్రుడూ, నిజాయితీపరుడూ అంటూ పరిచయం చేశాడు.

ఉమర్ ఆ విధంగా నెలరోజులపాటు ముస్తఫా యింట సుఖంగా కాలం గడిపి, ఒకనాడు అతడు ఖాతాదారులతో, తోటి వర్తకులతో కలిసివుండగా, అతణ్ణి సమీపించి, ''ఇక నేను సెలవు తీసుకుంటాను. నా సంచీ తెప్పించి యివ్వు,'' అన్నాడు.

ముస్తఫా విచారంగా, ''ఇంకా కొంత కాలం నాకు అతిథిగా వుంటే చాలా సంతోషించేవాణ్ణి. అది సరే, సంచీ అంటా వేమిటి?'' అని అడిగాడు.

''మిత్రమా, నీ కెంత మతిమరుపు!'' అంటూ ఉమర్ ఆశ్చర్యం నటించి, ''నేను వస్తూనే నీకు దాయమని వెయ్యి బంగారు మొహరీలు వున్న సంచీ యిచ్చా గదా? దాన్ని యిస్తే, యిక ప్రయాణమవుతాను,'' అన్నాడు.

''నీ మాటలు నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నవి. బంగారు మొహరీలు వున్న సంచీ అంటూ, నువ్వు యివ్వనేలేదు. ఏమిటిలా వింతగా మాట్లాడుతున్నావు?'' అన్నాడు ముస్తఫా ఆశ్చర్యంతో.

మోసకారి ఉమర్ ఆ జవాబు వింటూనే మతిపోయినవాడిలా చుట్టూ వున్న వాళ్ళకేసి చూశాడు. వాళ్ళకు ఉమర్ మాటల్లో నిజం వున్నదనిపించింది.

వాళ్ళు, ముస్తఫాతో, ''చాలా కాలానికి ప్రాణమిత్రుణ్ణి కలుసుకున్న ఉత్సా

హంలో, అతడిచ్చిన సంచీ సంగతి మరిచి వుంటావు. వెతికి చూడు, ఇంట్లో ఎక్కడో ఒకచోట దొరక్కపోదు.'' అన్నారు.

ముస్తఫా రెండు, మూడుక్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, తల అడ్డంగా తిప్పుతూ, ''డబ్బుకు సంబంధించిన వ్యవహారాల్లో, నాకు మతిమరుపంటూ వుండదు. ఇతను ఏదో పొరబాటువల్ల నా మీద యిలాంటి నేరం మోపుతున్నాడు,'' అన్నాడు.

ఆ మరుక్షణం ఉమర్ పెద్దగా గొంతెత్తి, ''నావి వెయ్యి మొహరీలు యితను దొంగిలించాడు! అయ్యో, వెయ్యి మొహరీలు!'' అంటూ అరిచాడు.

ఉమర్ యిలా అనగానే ముస్తఫాకు, వాడి నిజస్వరూపం తెలిసినట్టయింది. అతడు కోపంగా, ''ఇక నోరుమూసుకుని, యిక్కణ్ణించి వెళ్ళు!'' అన్నాడు.

ఆ ఇద్దరి పోట్లాటా చూసి, బజారున పోయే కొంతమంది వాళ్ళచుట్టూ చేరారు. వాళ్ళకు యువవర్తకుడు ముస్తఫా నిజాయితీపరుడని తెలుసు. కాని, మోసకారి ఉమర్, యీ నెలరోజుల్లో, చాలామందిని తాను గొప్ప మర్యాదస్థుణ్ణనీ, నిజాయితీ పరుణ్ణనీ నమ్మించాడు. ఆ కారణంవల్ల, వాళ్ళు ముస్తఫా అబద్ధం ఆడుతున్నాడనుకున్నారు.



ముస్తఫాకు యీ పరిస్థితి చాలా అవమానకరంగా తోచింది. అక్కడ చేరిన వాళ్ళల్లో అతడి ప్రాణమిత్రుడొకడు, ఉమర్ పెద్ద మోసకారి అయివుంటాడనుకుని, తిరుగులేనిదనుకున్న ఒక పథకం ఆలోచించి, వాణ్ణి సమీపిస్తూ, ''మనం అందరం ఏవో పొరబాట్లు చేస్తుంటాం. కాని, నువ్వు చేసిన పొరబాటు చాలా చిత్రమైనది. నువ్వు వెయ్యి మొహరీలు వున్న సంచీని దాయమని యిచ్చింది, ముస్తఫాకు కాదు, నాకు! శాంతపడు, జనం వెళ్ళిపోగానే, నీ సంచీ యిచ్చేస్తాను. ఇప్పటికైనా నీ పొరబాటు తెలుసుకున్నావా?'' అని అడిగాడు.

మోసకారి ఉమర్ ఏ మాత్రం తొణ కుండా, ''అయ్యా, ఇందులో నేను చేసిన పొరబాటంటూ ఏమీ లేదు. నీ దగ్గర దాచిన ఆ రెండవ డబ్బు సంచీ ఎక్కడికీపోదని నాకు తెలుసు! ఈ ముస్తఫాలాగా నువ్వు పచ్చి అబద్ధాలాడ వన్నది నిజం. బాగ్దాదునగర పౌరు లందరూ మోసకారులని ఎవరూ అనలేరు. సరే, ఆ డబ్బు సంచీ తక్షణం నా కిచ్చెయ్యి,'' అన్నాడు.

ఆ జవాబుకు ముస్తఫా మిత్రుడు దిగ్భ్రాంతుడయ్యాడు.

ఉమర్, ''మిత్రమా, ఆలస్యం ఎందుకు? ఆ సంచీతీసుకురా,'' అన్నాడు.

ముస్తఫా వర్తకమిత్రుడు చేసేదేంలేక, మోసకారికి వెయ్యి మొహరీలు యిచ్చు కున్నాడు. దీనితో అక్కడ చేరిన జనానికి ఉమర్ గొప్ప ధనవంతుడన్న అభిప్రాయం ఏర్పడింది. వెయ్యి మొహరీలున్న రెండవ డబ్బు సంచీ ముస్తఫా దగ్గిర వున్నదని వాళ్ళు గుసగుసలాడసాగారు.

ముస్తఫా పరిస్థితి గ్రహించి, యిక తన మాట ఎవ్వరూ నమ్మరనుకుని, ఉమర్‌కు వెయ్యి బంగారు మొహరీలు యిచ్చు కున్నాడు. వాడు సంతోషంగా బాగ్దాదు వదిలి, కెర్‌మాన్‌షా దారి పట్టాడు. .

కొద్ది రోజుల తరవాత మోసకారి ఉమర్‌ను ఎరిగివున్న వాళ్ళు, ముస్తఫాతో, "పొగడ్తలకు ఉబ్బిపోరాదన్న సంగతి, యిప్పటికి నీకు బాగా ఒంటపట్టిందను కుంటాము. మరిచిపోకు, యీ పాఠం చాలా డబ్బు పోసి మరీ నేర్చుకున్నావు!'' అన్నారు.

''ఆ మాట ముమ్మాటికీ నిజం,'' అన్నాడు యువ వర్తకుడు ముస్తఫా. అతడి ఆప్తమిత్రుడైన రెండో వర్తకుడు, ''నేను చాలా తెలివైనవాణ్ణనుకునేవాణ్ణి. ఆ మోసకారి దగ్గిర ఎంత బుద్ధిహీనంగా ప్రవర్తించాను! నేను నేర్చిన పాఠం కూడా, వాడికిచ్చిన డబ్బు విలువకు ఏమీ తీసిపోదు. ఇద్దరం చాలా ఖరీదైన పాఠాలు నేర్చుకున్నాం!'' అన్నాడు.





# మొండివాడు

కృపానందుడనే గురువు సంవత్సరంలో ఆరు నెలలు, తన ఆశ్రమంలో శిష్యులకు విద్యాబోధన చేసి, మిగిలిన ఆరు నెలల కాలం దేశాటనకు బయలుదేరి, ప్రజలకు ధర్మబోధ చేస్తూండేవాడు.

ఒకసారి ఆయన అలా దేశాటన చేస్తూ ఒక గ్రామం చేరాడు. గ్రామ ప్రజలు ఆయనకు ఘనంగా స్వాగతం ఇచ్చి, రాత్రికి రామాలయంలో సభ ఏర్పాటు చేశారు. కృపానందుడు అక్కడ చేరిన వారికి అనేక ధార్మిక, ఆధ్యాత్మిక విషయాలు వివరించి చెప్పసాగాడు. ప్రజలు ఎంతో కుతూహలంగా వింటున్నారు. మధ్యలో ఆ వూరి షావుకారు జనం ముందు లేచి నిలబడ్డాడు.

కృపానందుడు అతడికేదో ధర్మసందేహంకలిగి వుంటుందనుకుని, "నాయనా, ఏమిటి నీ సందేహం?" అని అడిగాడు.

దానికి షావుకారు ఎంతో వినయంగా, "స్వామీ, నాకు ఇంటి నుంచి బయలుదేరి నప్పటి నుంచీ అన్నీ సందేహాలే. వాటిల్లో చిల్లర సందేహాల మాటకేంగాని, అన్నిటి కన్న పెద్ద సందేహం ఇంటిరక్షణ గురించినది. ఇనప్పెట్లో వున్న డబ్బూ, ఇంటి ఆవరణలో వున్న ధాన్యం పాతర్ల లాంటి వాటిని, నౌకర్ల కాపలాకు వదిలేయడం అంత క్షేమం కాదు గదా!" అంటూ వెళ్ళిపోయాడు.

షావుకారు మాటలు అక్కడ వున్న జనానికి ఆశ్చర్యం కలిగించ లేదు గాని, కృపానందుడి ప్రధానశిష్యుడు శేఖరుడికి మాత్రం చాలా ఆశ్చర్యం కలిగించినై. అతడు కొంత సేపటికి సభ ముగిసి విడిదికి తిరిగి రాగానే, గురువు కృపానందుడితో, "గురువర్యా, ఆ షావుకారు మాటలు విన్నారుగదా? అతడికి ధనసంపాదనా,

వల్లూరు బాబురావు



దాని రక్షణా తప్ప, చిన్నమెత్తు దైవ చింతన కూడా వున్నట్టు లేదు. తమరు ముఖ్యంగా అలాంటి వాళ్ళ హృదయాల్లో దైవభక్తి చిగురించేలా చేయడం అవసరం,'' అన్నాడు.

శిష్యుడి మాటలకు కృపానందుడు చిరునవ్వు నవ్వి, ''నాయనా, నీ సలహా మెచ్చదగిందే! కాని, కొందరికి ధనార్జన పట్ల వుండే ఆసక్తి, ప్రపంచంలో మరి దేనిపైనా వుండదు. అలాంటి వారికి దైవ భక్తి, ధర్మకార్యాలను గురించీ చెప్పడం ఒక్కోసారి వృథా ప్రయాస అవుతుంది. నా సహాధ్యాయి బోధానందుడికి ఆ మధ్య కలిగిన ఒక వింత అనుభవం గురించి చెబుతాను విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు :

బోధానందుడికి ఆశ్రమం, శిష్యులూ అంటూ ఏమీలేవు. అతడెప్పుడూ దేశాటన చేస్తూ, ప్రజలకు మంచినీ, పుణ్యకార్యాల పట్ల ఆసక్తినీ కలిగించేందుకు ధర్మ బోధలు చేస్తూంటాడు.

ఒకసారి అతను ఒక గ్రామం వెళ్ళాడు. అక్కడ భద్రయ్య అనే వ్యాపారి గురించి పదిమందీ చెప్పగా విన్నాడు. ఈ భద్రయ్య వ్యాపార విషయాల్లో ఎవర్నీ నమ్మడు. అన్నీ స్వయంగా తనే చూసుకునే వాడు. ఒట్టి పిసినారి, లక్షలకు లక్షలు గడించాడు.

''నా పని యిలాంటి వారిచేత ధర్మ కార్యాలు చేయించి, ఇంత పుణ్యం సంపాయించుకునేలాగా చేయడం. అయన యిల్లు ఎక్కడో చూపించండి,'' అని బోధానందుడు ప్రజల్ని అడిగాడు.

వాళ్ళు అతడికి భద్రయ్య ఇంటికి దారి చూపారు. భద్రయ్య బోధానందుణ్ణి ఎంతో భక్తిపూర్వకంగా ఆహ్వానించి, ''స్వామీ, తమరు ఒంటరిగా వున్న సమయం చూసి, నేనే వచ్చి, తమ దర్శనం చేసుకుందామనుకున్నాను. కాని, తమరే, నా ఇంటికి దయచేశారు. మీరు మహాత్ములు! అనేక మహిమలు కలిగిన

వారు. నా సిరిసంపదలు మరింతగా వృద్ధి అయేట్టు ఆశీర్వదించండి,'' అన్నాడు.

బోధానందుడు ఆ మాటలకు ఆశ్చర్య పడి, ''భద్రయ్యా, యిప్పటికే నీకు అంతు లేని సిరిసంపదలున్నవి. ఇంకా ఏంలోటు? నే చెప్పేది జాగ్రత్తగా విని, ఆలో చించుకో,'' అన్నాడు.

''స్వామీ, అలాగే సెలవివ్వండి,'' అన్నాడు భద్రయ్య.

''నువ్వెంత సంపాయించినా, పోయే టప్పుడు నీ వెంట పూచికపుల్ల కూడా రాదు. నీకున్న సంపదను పుణ్యకార్యాల కోసం వినియోగించు, నీ మనస్సును సత్య స్వరూపుడైన భగవంతుడి మీద లగ్నం చెయ్యి,'' అన్నాడు బోధానందుడు.

''అలా చేశాననుకోండి, స్వామీ! అప్పుడు నాకలగబోయే మేలేమిటి?'' అని అడిగాడు భద్రయ్య.

భద్రయ్య తరచుగా వ్యాపార విష యాల్లో వాడే మాటలతోనే చెబితే, అతడు త్వరగా అర్థం చేసుకోగలడనుకుని, బోధా నందుడు, ''పుణ్యకార్యాలు చేసినందు వల్ల, నీకు చాలా మేలు కలుగుతుంది, భద్రయ్యా! నీ పుణ్యానికిగాను భగ వంతుడు స్వర్గంలో నీ పేర కొంత స్థలాన్ని కేటాయిస్తాడు. అక్కడే నీకు శాశ్వతమైన సుఖాలు అనుభవించడానికి వీలుకలుగు తుంది,'' అన్నాడు.

ఆ మాటలకు భద్రయ్య చాలా సంతో షంగా, ''స్వామీ, ఇలాంటి మంచి లాభ





సాటి విషయాలు చెప్పేవారు, యింత వరకూ నాకు కనిపించలేదు. నా అదృష్టం కొద్దీ తమరు దయచేసి, నాకు చక్కని జ్ఞానం కలిగించారు. ఇక నుంచి తప్ప కుండా మీరు చెప్పినట్టే నడుచుకుంటాను,'' అన్నాడు.

బోధానందుడు అతడిలో వచ్చిన మార్పుకు చాలా ఆనందం చెంది, మరొక గ్రామం వెళ్ళిపోయాడు.

కొన్నాళ్ళ తర్వాత బోధానందుడు అదే గ్రామం రావడం జరిగింది. వాకబు చేయగా భద్రయ్య యీ మధ్య కాలంలో ఒక్క పుణ్యకార్యం చేయకపోగా, మరింత ఆస్తిని కూడబెట్టాడని అతడికి తెలిసింది.

వెంటనే బోధానందుడు భద్రయ్యను కలుసుకుని, ''నేను చెప్పినట్టు దాన ధర్మాలుచేసి యింత పుణ్యంసంపాయించు కుంటానని లోగడ మాట యిచ్చావు. ఇప్పుడు నువ్వు చేస్తున్నదేమిటి? నేను చెప్పిన మాటలు నీకు సరిగా అర్థం కాలేదా?'' అని అడిగాడు కొంచెం కోపంగా.

అందుకు భద్రయ్య ఎంతో వినయంగా, ''స్వామీ, ఆగ్రహించకండి! మీరు చెప్పిన మాటలు బాగా అర్థం చేసుకున్న తర్వాతే యిలా చేస్తున్నాను,'' అన్నాడు.

''అంటే, నా మాటలు నిన్ను మరింత ధనార్జనకు ప్రోత్సహించాయా?'' అన్నాడు బోధానందుడు ఆశ్చర్యంగా.

''స్వామీ, నా విన్నపం ఆలకించండి. ఇక్కడ నేను పుణ్యం చేస్తే, భగవంతుడు స్వర్గంలో నా పేర జమవేస్తాడని చెప్పారు; బాగానే వుంది. కాని, యిందులో చిన్న చిక్కు వుంది,'' అన్నాడు భద్రయ్య.

''ఏమిటా చిక్కు?'' అన్నాడు బోధానందుడు.

''ఇంత చిన్న వ్యాపారంలో కూడా నేను అప్పుడప్పుడూ పొరపాటున ఒకరి ఖాతాలో వేయవలసిన జమా ఖర్చులు మరొకరికి వేస్తూంటాను. ఇంత లోకంలో నా పేరు గలవాళ్ళు ఎందరో వుంటారు.

అలాటప్పుడు నేను చేసిన పుణ్యం జమ భగవంతుడు మరొకరి ఖాతాలో వెయ్య డని నమ్మకం ఏమిటి? అలా జరిగితే, నాగతేం కాను,'' అన్నాడు భద్రయ్య.

భద్రయ్య మాటలకు బోధానందుడు నివ్వెరపోతూ, ''ఇంత గొప్ప వ్యాపారివి, యింత అమాయకంగా మాట్లాడు తున్నావేం!'' అన్నాడు.

''స్వామీ, నేనేం అమాయకుణ్ణి కాదు. పుణ్యం చేస్తే దేవుడు నా కోసం స్వర్గంలో కొంత స్థలాన్ని కేటాయిస్తాడని చెప్పారు. నే నీ లోకం నుంచి అక్కడి కెప్పుడు వెళతానో తెలియదు. అప్పటి వరకూ ఆ స్థలం మరొకరు ఆక్రమించరని నమ్మకం ఏమిటి? నా కంటే ముందు వెళ్ళిన వాళ్ళు ఆ పని చేయవచ్చుగదా?'' అన్నాడు భద్రయ్య.

ఆ ప్రశ్నకు ఏం జవాబు చెప్పాలా అని బోధానందుడు ఆలోచిస్తున్నంతలో భద్రయ్య, ''ఇక్కడ వ్యాపారంలో అన్నీ నేను స్వయంగా చూసుకుంటున్నా కొన్ని మోసాలు జరుగుతున్నవి. నేను యిలాంటి వ్యవహారాల్లో, ఆ దేవుణ్ణి కూడా నమ్మను. కనక, నేను అక్కడికి వెళ్ళిన తర్వాతే స్వయంగా ఆయనతో మాట్లాడి, ఆ స్థలం విషయం ఏదో కట్టుదిట్టం చేసు కుంటాను,'' అన్నాడు.

"భద్రయ్యా, నేను చేసిన ధర్మబోధ నీకు అర్థమైన తీరు యిదా!'' అంటూ బోధానందుడు విస్మయం చెందాడు.

''అవును, స్వామీ! ఇంతటి మహా త్ములు మీరు చెప్పినమాటలే, నేను సరిగా వినలేదను కుంటున్నారా? నా లాంటి పామరులకు ఏదైనా బోధించదలచి నప్పుడు, దానిలోని బాగోగులూ, సాధ్యా సాధ్యాలూ ముందుగా బేరీజు వేసుకుని మరీ బోధిస్తూ వుండండి,'' అన్నాడు భద్రయ్య.

ధనసంపాదనే సర్వం అనుకునే మొండివాణ్ణి మార్చడం సాధ్యపడదను కుంటూ, బోధానందుడు అక్కడి నుంచి మరొక గ్రామం వెళ్ళాడు.





# దైవజ్ఞుడి సలహా

ఒక గ్రామంలో రామయ్య అనే భూస్వామి ఉండేవాడు. అతని భార్యకు క్రమంగా ఆరోగ్యం చెడి చివరకు మంచం పట్టింది. జబ్బేమిటో వైద్యులకు అంతుచిక్కలేదు. వ్యాధి లక్షణాలను బట్టి మందులూ, మాకులూ ఇస్తే అవేవీ పనిచెయ్యలేదు.

రామయ్య ఉండే గ్రామానికి దగ్గిరలోనే మరొక గ్రామంలో ప్రశ్నలు చెప్పే దైవజ్ఞుడొకడుండేవాడు. కోరికలు తీరనివారెవరైనా ఆయన వద్దకు వెళ్ళి దక్షిణా, తాంబూలమూ ఇచ్చి కూర్చుంటే, ఆ దైవజ్ఞుడు వాళ్ళు వచ్చిన పని తెలుసుకుని, ఆ పని సానుకూలమయే మార్గం చెప్పేవాడు. ఆయనతో ఒకటే చిక్కు; ఆయన చెప్పేది జాగ్రత్తగా విని, సరిగా అర్థం చేసుకోవాలి. సరిగా వినకపోయినా, విన్నది అర్థంకాక ప్రశ్నలు వేసినా ఆయన రౌద్రంగా మండిపడి, అవతలివాడు ఎంతటివాడైనా సరే ముందు తూలనాడేవాడు. ఆ తరవాత తాను చెప్పినదాన్ని వివరంగా తెలియజేసేవాడు.

ఈ కారణం చేత కాస్త అభిమానం గల వాళ్ళు ఎవరూ ఆయన దగ్గిరికి వెళ్ళటానికి ఇష్టపడేవారు కారు. కాని, పని జరగటం ప్రధానంగా పెట్టుకున్న వాళ్ళు, ఆయన చేత నాలుగు పడటానికి సిద్ధమై వెళ్ళేవారు.

రామయ్యకు ఈ దైవజ్ఞుణ్ణి చూసి, తన భార్య ఆరోగ్యం బాగుచేయించుకోవాలన్న ఆలోచన చాలా సార్లు కలిగింది. కాని అభిమాని కావటం చేత, ఆయన చేత అవమానం పొందవలసి వస్తుందని సంకోచిస్తూ రోజులు గడవనిచ్చాడు. అయితే, తన భార్య జబ్బు నిమ్మళించాలంటే దైవజ్ఞుడి దగ్గిరికి పోక తప్పదని రామయ్యకు తోచింది. అందుచేత

అతను ఒక మంచి రోజు చూసి, దక్షిణ తాంబూలం చేతబట్టుకుని దైవజ్ఞుణ్ణి చూడబోయాడు.

దైవజ్ఞుడు తెల్లటి గడ్డంతోనూ, మీసాలతోనూ, మంచి తేజస్సుతోనూ రామయ్యకు కనిపించాడు. రామయ్య ఎదురుగా కూర్చోగానే ఆయన, "నీ పేరు రామయ్య. నీ భార్య మంచం పట్టింది. ఆమె ఎలా తేరుకుంటుందో తెలుసుకోవాలని వచ్చావు. అహంకారివిరా నువు. మహా దురహంకారివి! ఏమైతేనేం? వచ్చావు. పాపం. నువు ప్రకృతివిరుద్ధమైన కార్యం చేశావు. సహజ సిద్ధమైన ప్రవాహానికి అనకట్ట వేశావు. ఆ అనకట్ట తీసెయ్యి. నీ భార్య వ్యాధి నయమవుతుంది. వృథాగా మందులకూ, మాకులకూ ధనవ్యయం చేయకు. నేను చెప్పింది తెలిసింది కద?" అన్నాడు.

రామయ్య లోలోపల ఆశ్చర్యపడుతూ, తెలిసిందన్నట్టు తల ఆడించాడు. నిజానికి దైవజ్ఞుడు చెప్పినది, రామయ్యకేమీ అంతు పట్టలేదు. తెలియలేదంటే దైవజ్ఞుడు ఇంకెంత అవమానకరంగా మాట్లాడతాడో అని రామయ్యకు భయం వేసింది. అందుచేత అతను మాట్లాడకుండా లేచి ఇంటికి వచ్చేశాడు.

దైవజ్ఞుడు చెప్పిన మాటలు మననం చేసుకుంటూ వుంటే రామయ్య కొక



సంగతి జ్ఞాపకం వచ్చింది. రామయ్య తాను బలవంతుడు గనక తన చేను పక్కగా ఉన్న పంటకాలవకు అడ్డుకట్ట కట్టి, కిందటేడు తన పొరుగున ఉన్న కామయ్య చేనుకు నీరు లేకుండా చేశాడు. అందువల్లనే తన భార్యకు జబ్బు చేసిందని దైవజ్ఞుడు చెప్పినట్టు రామయ్యకు అర్థమయింది.

అందుకని రామయ్య కామయ్యను పిలిచి, "చూడు కామయ్యా, ఒక కారణంచేత కిందటేడు నీకు పంటకాలవ నీరందక, నువు చెరువు నీటితో ఇబ్బంది పడ్డావు. ఇక ముందు నీ చేనుకు కాలవ నీరు అందేటట్టు చేస్తాను," అని మంచిగా

చెప్పి పంపేసి, పంటకాలవకు తాను పెట్టిన అడ్డు తన మనుషుల చేత తీయించేశాడు.

ఇక తన భార్య కోలుకుంటుందనుకున్నాడు రామయ్య. కాని అలా జరగలేదు. పైపెచ్చు ఆమె ఇంకాస్త క్షీణదశకు వస్తున్నట్టు కూడా కనబడింది.

దైవజ్ఞుడు చెప్పిన మాటలను రామయ్య మళ్ళీ మననం చేసుకున్నాడు. సహజ ప్రవాహానికి తానింకే అనకట్ట కట్టాడో అతనికి ఎంత తన్నుకున్నా అర్థం కాలేదు. అందులో ఏదో గూఢార్థం ఉండిఉండాలి. అది దైవజ్ఞుడే చెప్పాలి. చేసేది కనిపించక రామయ్య మరొకసారి దైవజ్ఞుడి దగ్గరకు వెళ్ళాడు.

దైవజ్ఞుడు అతణ్ణి చూస్తూనే, ''మళ్ళీ వచ్చావా? నువు మహా దురహంకారివని నేను మొదటేచెప్పానే. నేను చెప్పిన సలహా నీకు అర్థం కాలేదు. అర్థమయ్యేటట్టు చెప్పమని అడగడానికి, అభిమానం అడ్డొచ్చి అర్థమయిందని తల ఆడించావు. చెబుతాను విను. ఈ దురహంకారంతోనే నువు నీ భార్యను ఆమె పుట్టింటి వారికి దూరం చేశావు. ఆమెకు తమ కన్నవారిపై ఉండే ప్రేమ సహజ ప్రవాహంలాంటిది. ఏదో అల్ప కారణం ఆధారంగా నువా ప్రవాహానికి అనకట్ట కట్టావు. అది మొదలు నీ భార్య ఆరోగ్యం చెడింది. ఆ మనోవ్యాధి క్రమంగా పెరిగి ఆమె కాస్తా మంచం పట్టింది. వెళ్ళు! పోయి మీ అత్తవారికి క్షమాపణ చెప్పుకుని వారిని తీసుకురా. వాళ్ళను చూసి నీ భార్య కోలుకుంటుంది,'' అన్నాడు.

రామయ్య అహంకారం ఆ దెబ్బతో దిగిపోయింది. అతను ఆ రోజే బయలుదేరి తమ అత్తవారూరు వెళ్ళి, అత్తమామలతో ఎంతో మంచిగా మాట్లాడి, వారిని తీసుకువచ్చాడు. తన తలితండ్రులను చూసిన క్షణం నుంచీ రామయ్య భార్యలో మార్పు వచ్చేసింది. కొద్ది రోజులలోనే ఆమె లేచి తిరుగుతూ, చూస్తూండగానే పూర్ణారోగ్యం పొందింది.





# విష్ణుకథ

శ్రీమతి స్వయంవరానికి దేశదేశాల రాజులు, ముల్లోకాల్లోని ప్రముఖులు అంతా వచ్చారు. విష్ణు వేషంతో నారదుడు స్వయంవర మంటపం ప్రవేశించగానే అంతా ఘొల్లున నవ్వారు. తన ముఖం కోతి ముఖంగా మారిందని తెలుసుకొని నారదుడు అవమానంతో ఉడికిపోయాడు.

శ్రీమతి విష్ణువును ధ్యానించింది. విష్ణువు ఆమె ముందు సాక్షాత్కరించాడు. శ్రీమతి మాలవేసి విష్ణువును వరించి, అతనితో వైకుంఠానికి వెళ్ళింది.

అది చూసి నారదుడు మరింత కోపంతో పర్వతుణ్ణి కూడగట్టుకొని అంబరీషుడిపై మండిపడ్డాడు. అడిగినప్పుడు తమకు యివ్వకుండా శ్రీమతిని విష్ణువుకి అప్పగించినందుకు అంబరీషుణ్ణి నాశనం చేయదలచి, శపించడానికి సిద్ధపడ్డారు. అప్పుడు విష్ణుచక్రం వచ్చి వారిని వెంట తరిమింది.

పర్వత నారదులిద్దరూ వైకుంఠానికి పరుగెత్తారు.

అక్కడ శ్రీమతితో ఉన్న విష్ణువును చూసి నారదుడు మరింత ఉడుకుమోత్తనంతో, "నువ్వు కూడా నీ శ్రీమతిని— అంటే నీ భార్యామణిని పోగొట్టుకొని విలపిస్తావు! నన్ను కోతిముఖంవాడిని చేసి మోసగించావు, వానరులే నీ సహచరులై సహాయపడతారు గాక!" అని విష్ణువును శపించాడు.

నారదుడి శాపానికి విష్ణువు మందహాసం చేశాడు. శ్రీమతి లక్ష్మీదేవిగా నిజరూపం

10. దుర్వాస గర్వభంగం



అప్పటినుంచి అంబరీషుడికి ఎవరివల్లా ఎటువంటి హానీ జరగకుండా, తన చక్రం అతనికి రక్షణగా ఉండేలాగ విష్ణువు అనుగ్రహించాడు.

దుర్వాసుడికి తపోబల గర్వంతో బాటు తామసం ఎక్కువ. ఒకనాడు తన ఆశ్రమం నుండి బయలుదేర బోతూండగా, ఆనంద పారవశ్యంతో కన్నులు మూసి విష్ణుసంకీర్తన పాడుతూ వస్తున్న నారదుడు ఎదురయ్యాడు.

''ఓహో, నారదా! కలహ భోజనంతో కడుపు నిండినట్టుందే! చాలా ఆనంద పారవశ్యంలో మునిగి ఉన్నావు!'' అంటూ దుర్వాసుడు నారదుణ్ణి పలకరించాడు.

నారదుడు కళ్ళు తెరిచి వంగి వంగి నమస్కరిస్తూ, ''దుర్వాసుల వారికి ప్రణామాలు! అలాంటి దేమీపడక నకనకలాడుతున్నదే గాని, మహర్షీ! విష్ణుభక్తి తత్పరులైన వారిని చూసినపుడల్లా నాకు పరమానందం పొంగుతూనే ఉంటుందాయె. అంబరీషుణ్ణి చూసి ఇలా వస్తున్నాగదా మరి....,'' అన్నాడు మరొకసారి వంగి వంగి ప్రణామం చేస్తూ.

''అంతటివాడా, అంబరీషుడు?!'' అన్నాడు దుర్వాసుడు.

''ఔను, మహర్షీ! విష్ణువు అనుగ్రహం పొందిన రాజర్షిసత్తముడు, ద్వాదశీ

పొందింది. మునులను ఆవరించిన మాయ తొలగింది. జరిగినదానికి సిగ్గుపడుతూ నారద పర్వతులు విష్ణు పాదాల మీద పడ్డారు.

నారదుడు విష్ణు పాదాన్ని కన్నీటితో తడుపుతూ, శపించినందుకు నొచ్చుకొంటూంటే విష్ణువు నెమ్మదిగా మందహాసం చేస్తూ, నారదుడి తల నిమిరి, ''నారదా! త్రికాలవేత్తవైన నువ్వు విచారించడమేమిటి! నీ నోటిమాట అమోఘం. నువ్వు శపించింది కూడా నా సంకల్పమే! నా రామావతార సమయంలో అలాగే జరుగుతుందిలే! అదీ లోకకల్యాణం కోసమే!'' అని చెప్పాడు.

వ్రతం అతని ప్రాణం!'' అన్నాడు నారదుడు.

''ఏమిటి నారదా! ఆ రాజును తెగపొగి డేస్తున్నావు?!'' అన్నాడు దుర్వాసుడు.

''అతణ్ణి చూస్తే తెలుస్తుంది, పొగడ్త కాదని! నీలాంటి మహర్షీశ్వరుడు అతని సదనాన్ని పావనం చేయడం వల్ల, అతని జన్మ ధన్యమౌతుంది, చరితార్థుడై మరింత వినుతికెక్కుతాడు!'' అని చెప్పి నారదుడు నారాయణ నామ జపం చేస్తూ వెళ్ళాడు.

నారదుడి మాటలు దుర్వాసుణ్ణి రెచ్చగొట్టాయి. అంబరీషుడి దగ్గిరికి బయలుదేరాడు.

ఏకాదశి ఉపవాసం చేసి, ద్వాదశీ వ్రత సమాప్తిగా అప్పుడే భుజించడానికి అంబరీషుడు సిద్ధమౌతున్నాడు. దుర్వాసుడి రాకకు పరమానంద భరితుడై, అర్ఘ్యపాద్యాదులతో పూజించి, భోజనానికి ఆహ్వానించాడు.

దుర్వాసుడు నదిలో స్నానం చేసి వస్తానని చెప్పి వెళ్ళాడు. వెళ్ళినవాడు ఎంతకూ తిరిగి రాలేదు. ద్వాదశి ఘడియలు మించిపోతున్నవి; ద్వాదశి దాటకుండా భోజనం చేయకపోతే వ్రతభంగం అవుతుంది. అతిథి రాకుండా తింటే దోషమౌతుంది!



అప్పుడు విజ్ఞులైన పెద్దలు అంబరీషుడితో కొంచెం నీరు చప్పరించితే వ్రతభంగమూ కాదు, అతిథి రాకుండా భుజించిన దోషమూ అంటదు అని చెప్పగా అలాగే అతను జలపారణం చేశాడు.

ద్వాదశి పోయి త్రయోదశి వచ్చినట్లే హుటా హుటిగా ఆగ్రహావేశంతో పట పట పళ్ళు కొరుకుతూ, జటాజూటాన్ని విప్పి విదలిస్తూ దుర్వాసుడు వచ్చాడు.

''ఓ రాజాధమా! విష్ణుభక్తుడి నంటూ గర్వించి ఆతిథ్యధర్మానికి అపచారం చేస్తావా? నాకే అవమానం తలపెట్టడానికి నీ కెన్ని గుండెలు? నేనెవర్నో తెలుసా? నా పేరు వింటే ముల్లోకాలూ, ముమ్మూ



ర్తులూ గడగడలాడవలసిందే! నా శాపానికి తిరుగులేదు. దుర్మరణం పాలౌతావు గాక!'' అని హుంకరిస్తూన్న దుర్వాసుడి పాదాల మీద తలవాల్చి అంబరీషుడు, ''ఋషీశ్వరా! వ్రత భంగం కాకుండా వుండేందుకు జలపారణం మాత్రమే చేశాను. మన్నించమని వేడుకొంటున్నాను!'' అన్నాడు.

దుర్వాసుడు అంబరీషుని తలను తన్ని, ''దుర్వాసుడి కోశంలో మన్నించడం అనేది లేదు! భక్తీ, తపశ్శక్తుల్లో ఏది గొప్పదో నువ్వు స్వయంగా చూద్దువుగాని!'' అని అంటూ జటాజూటాన్ని సింహంలాగ విదల్చాడు.

దుర్వాసుడి తపోమహిమ అంతా అతని జడల్లో అనేక శక్తులుగా నిక్షిప్తమై వుంది. పొడవైన ఒక జడను తీసి పట్టుకొని మరో చేత్తో యోగదండాన్ని ఎత్తి ఆడిస్తూ జడను ఝుళిపించాడు.

జడ నుండి నిప్పురవ్వలు విరజిమ్ముతూ దట్టమైన నల్లని పొగలు సుడులు తిరుగుతూ ఆకాశానికి లేచాయి. ఆ పొగల్లో భయంకరాకారంతో పర్వతంలా కృత్య అనే మహా భూతం ఆవిర్భవించింది.

కృత్య ప్రళయభీకరంగా గర్జిస్తూ అంబరీషుడిని చంపడానికి వురకబోతున్న మరుక్షణంలో అతనికి రక్షణగా విష్ణువు అనుగ్రహించిన చక్రం జ్వాలలు కక్కుతూ రివ్వునవచ్చి కృత్యను ముక్కలు ముక్కలుగా నరికి మటుమాయం చేసింది. అదిచూసి దుర్వాసుడికి ముచ్చెమటలు పోశాయి.

కృత్యను నాశనం చేసిన విష్ణుచక్రం అంతటితో ఆగక, దుర్వాసుడి మీదకు వెళ్ళింది.

దుర్వాసుడు మరొక జడను పెరికి విసిరాడు. పర్వతమంత వజ్రపాషాణం అడ్డునిలిచింది. చక్రం దాన్ని తుక్కుతుక్కుగా తూలగొట్టి దుర్వాసుణ్ణి వెంబడించింది.

ఇంకొక జడను ఋషి విసిరాడు! ఆకాశమంత మంచు మేఘం ఏర్పడి వెనువెంటనే చక్ర జ్వాలల్లో ఆవిర్లు గక్కుతూ హరించిపోయింది.

దుర్వాసుడు పరుగెత్తుతూంటే అతని జటాజూట మంతా వెంట తరిమే చక్ర జ్వాలలు తగిలి మసి నుసి అయింది. ఈ విధంగా అతడి తపశ్శక్తి అంతా ఆహుతి అయిపోయింది.

చెట్టనక పుట్టనక, అడవులు నదులు పర్వతాలు దాటుతూ, దుర్వాసుడు పరుగెత్తుతున్నాడు. చక్రం తరుముకొంటూ వస్తోంది; మునిని ముల్లోకాలు తిప్పింది. దుర్వాసుడు బ్రహ్మలోకానికి పరుగు తీస్తుంటే నారదుడు ముసి ముసి నవ్వులతో, "హా! దుర్వాసులవారేనా! ఏమిటా పరుగు?" అని అంటూంటే మారు మాట రాక వెన్నెంట వస్తోన్న చక్రాన్ని చూపిస్తూ దుర్వాసుడు అదే పరుగున బ్రహ్మముందు పడ్డాడు.

"నేను విష్ణునాభికమలంనుంచి వచ్చిన వాణ్ణి, నేనేం చెయ్యగలను? చక్రాన్ని వారించగలనని ఎలాగ అనుకున్నావు, దుర్వాసా?" అన్నాడు బహ్మ.

"బ్రహ్మవని వస్తే ఇంతేనా నీ పస! నన్ను రక్షించగల ఆ మహేశ్వరు డున్నాడులే!" అన్నాడు ఋషి.



"ఔను, ఔను, దుర్వాసా! ఆ మాటా నిజమే. ఎంత త్వరగా వెళ్తావో కైలాసానికి, వెళ్లు వెళ్లు!" అన్నాడు బ్రహ్మ చేతులు దులుపుకొంటూ.

కైలాసానికి వెళ్ళి దుర్వాసుడు శివుణ్ణి రక్షించమని మొరపెట్టాడు.

"చక్రం విష్ణువుది. కోరి విరోధం తెచ్చుకో మన్నావా? వెళ్ళు. నీ దురహంకారానికి ఫలితం అనుభవించక తప్పుతుందా మరి! వెళ్ళు, వెళ్ళు!" అన్నాడు శివుడు.

దుర్వాసుడు వైకుంఠానికి పరుగెత్తి విష్ణువు ముందు పడి, దీనాతి దీనంగా చక్రాన్నినివారించమంటూశరణువేడాడు.



''అంబరీషుడికి రక్షగా నా చక్రాన్ని ఎప్పుడో అనుగ్రహించాను. అందువల్ల, ఇప్పుడు నేనేం చేసేది మహర్షీ? అంబరీషుణ్ణే చక్రాన్ని వారించమని అర్థించు!'' అన్నాడు విష్ణువు.

దుర్వాసుడు హతాశుడై లేచాడు. అతని అహంకారం నశించింది. అతని తల బోసి పోయి వుంది. తపశ్శక్తి అంతా తుడుచుకు పోయింది, భక్తి ముందు తపశ్శక్తి ఎందుకూ పనికి రాదని తెలిసింది. అంబరీషుడి దగ్గిరకు బయలుదేరాడు. చక్రం శాంతంగా వెంట వెళ్తున్నది. దుర్వాసుడు పాదాలు పట్టుకోబోతూంటే అంబరీషుడు వారించి, లేవనెత్తి చక్రాన్ని ఆగమన్నాడు. చక్రం వెనక్కు మళ్ళి కొంత సేపటికి అదృశ్యమైంది.

అగ్రగణ్యులైన విష్ణువు భక్తుల్లో అంబరీషుడు పేరు పడ్డాడు.

సూర్యవంశ రాజుల్లో గాధి ఒక ప్రముఖుడు. గాధి కుమారుడు విశ్వామిత్రుడు, కృతాశ్వుడి దగ్గిర ధనుర్విద్య నేర్చాడు. అనేక అస్త్రాల్ని పొందాడు. అస్త్రవేత్తగా పేరు పొందాడు.

విశ్వామిత్రుడు రాజ్యపాలనకు వచ్చాక ఒకనాడు సపరివారంగా వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్ళాడు వసిష్ఠ మహర్షి తన హోమధేనువు మహిమ వల్ల అందరికీ గొప్ప విందు చేశాడు.

పదిలక్షల గోవులను తీసుకొని హోమధేనువును ఇమ్మని విశ్వామిత్రుడు అడిగాడు; వసిష్ఠుడు యివ్వనన్నాడు.

విశ్వామిత్రుడు బలాత్కారంగా గోవును పరివారంచేత తోలించుకొని వెళ్ళబోతూంటే, వసిష్ఠుడు తన తపోబలంతో హోమధేనువు నుండి అనేక మంది శబర యోధుల్ని పుట్టించాడు.

విశ్వామిత్రుణ్ణి అతని పరివారాన్ని ధేనువు నుండి వచ్చిన యోధులు చిత్తు చిత్తుగా తరిమికొట్టారు.

రాజరికం కంటే తపోబలం మిన్న అని తెలుసుకొని విశ్వామిత్రుడు రాజ్యం

విసర్జించి అనేక సంవత్సరాలు గొప్ప తపస్సు చేశాడు. తపస్సు సాధించి వసిష్ఠుడితో సమానుడనిపించుకున్నాడు. అప్పటినుంచి విశ్వామిత్రుడు వసిష్ఠుడితో పోటీగా వుంటూ వచ్చాడు.

రావణుడి అనుచరులైన రాక్షసులు తమ తమ బలాలతో ఆర్యావర్తం మీద విరుచుకుపడి యజ్ఞయాగాల్ని ధ్వంసం చేస్తూ, మునులను ఋషులను బాధించి, ఆశ్రమాలు తగలబెట్టసాగారు.

విశ్వామిత్రుడు గొప్ప యాగం తల పెట్టాడు. అది జరగకుండా మారీచుడు, సుబాహుడు అనే రాక్షస ప్రముఖులూ, తాటక అనే రాక్షసీ పట్టుదలతో ధ్వంసం చేస్తున్నారు.

విశ్వామిత్రుడు యాగభంగానికి చింతాక్రాంతుడై, హిమాలయ ప్రాంతంలో ఉన్న తన సిద్ధాశ్రమంలో ధ్యానమగ్నుడై కూర్చున్నాడు.

ఆ ధ్యానసమాధిలో అతనికి విష్ణువు అవతారంగా సూర్యవంశంలో, రఘువు సంతతిలో పుట్టి పెరుగుతూన్న రాముడు కనిపించాడు !

లోకకల్యాణం కోసం రాక్షసనిర్మూలన చేయవలసి ఉన్న రాముడికి వసిష్ఠుడు నేర్పిన శాస్త్రవిద్య లెందుకూ అక్కరకు రావు! అస్త్ర, శస్త్ర విద్య, ధనుర్విద్యాపాటవం కావాలి! వాటిని అందించగల గురువు అతనికిప్పుడు కావాలి! రాముడికి అస్త్రాలు ఉపదేశించగల సమర్థుడు విశ్వామిత్రుడు ఒక్కడే!

విశ్వామిత్రుడికి ధ్యానసమాధిలో లక్ష్మీదేవి సీతగా జనకుని కూతురుగా పెరుగుతున్నది కూడా కనిపించింది. సీతారాముల కల్యాణం కూడా త్వరలో జరగాలి.

రాముడి వల్లనే తన యాగరక్షణ కూడా జరగాలి! తనకు తెలిసిన అస్త్ర విద్యనంతా రాముడికి ఉపదేశించి, అస్త్రవిద్యాకోవిదుణ్ణిగా చేయవలసిన బాధ్యత తనదిగా గుర్తించి విశ్వామిత్రుడు అయోధ్యకు బయల్దేరాడు.





# అపూర్వవిద్య

వర్ధనుడు ఇరవై ఏళ్ళ వయసువాడు. వాడికి నా అన్న వాళ్ళెవరూ లేరు. తల్లిదండ్రులు బతికి వున్నంతకాలం వాడి భుక్తికి ఏలోటూ రాలేదు. వాళ్ళు పోయాక వర్ధనుడికి బతుకుతెరువు సమస్య ఎదురయ్యింది. వాడికి చదువంట లేదు; పనిపాటులు చెయ్యడం మొదలే అలవాటు లేదు.

వాడు పుట్టి పెరిగిన గ్రామానికి సమీపంలో ఒక సిద్ధుడు ఆశ్రమం నిర్మించుకుని చాలా కాలంగా వుంటున్నాడు. ఆయన గొప్ప మహిమలు కలవాడని జనం చెప్పుకునే వారు.

వర్ధనుడు యిన్నేళ్ళ వయసులో, ఏ నాడూ ఆయన దర్శనం చేసుకోలేదు. వాడు బాగా ఆలోచించగా, తన బతుకు సమస్యకు సిద్ధుడు పరిష్కార మార్గం చూపగలడన్న ఆశ కలిగింది. ఆ ఆశతో వర్ధనుడు ఒకనాడు సిద్ధుడి ఆశ్రమానికి వెళ్ళాడు.

ఆ సమయంలో సిద్ధుడు ధ్యానసమాధిలో వున్నాడు. శిష్యులు ఏవో పనుల మీద బయిటికి వెళ్ళారు. వర్ధనుడు, సిద్ధుడికి కొంచెం ఎడంగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

కొంతసేపటికి సిద్ధుడు కళ్ళు తెరిచి, ఎదురుగా వున్న వర్ధనుణ్ణి చూసి, "ఏం కావాలి, నాయనా?" అని అడిగాడు.

వర్ధనుడు ఆయనకు వినయంగా నమస్కరించి, తను వచ్చిన పని చెప్పాడు.

సిద్ధుడు ఒకక్షణం మౌనంగా వూరుకుని, తరవాత వర్ధనుడితో, "నాయనా, నీకు ధనం యివ్వలేను. కాని, నీ తిండికీ, బట్టకూ నువ్వే స్వయంగా సంపాయించుకునే మార్గం మాత్రం చెప్పగలను," అన్నాడు.

బొమ్మిడి అచ్చారావు



''ఇప్పుడు నువ్వు నిలబడి వున్న భూమి అట్టడుగున ఏమున్నదో చెప్పగలవా?'' అని అడిగాడు.

వర్ధనుడు కిందికి చూసి, ''భూమి పొరలు, పొరలుగా వున్నది, స్వామీ. బాగా దిగువ నీటిజల కనిపిస్తున్నది,'' అన్నాడు.

సిద్ధుడు తృప్తిగా తలాడించి, ''ఇక వెళ్ళిరా, నాయనా. ఈ విద్యను స్వార్థానికి మాత్రం వాడకు. అలా చేశావో, ఆ ఒక్క సారికి మాత్రమే నీకు ఉపయోగిస్తుంది. తర్వాత నీ కళ్ళకు భూమి అడుగున వుండే నిధి నిక్షేపాలను చూసే శక్తి నశించి పోతుంది,'' అన్నాడు.

''ఆ సహాయం చాలు, స్వామీ!'' అన్నాడు వర్ధనుడు సంతోషంగా.

''నీ కొక విద్య అలవడేలా చేస్తాను. అదేమిటంటే—భూమి అడుగున, ఇనప పెట్టెలూ మొదలైన వాటిల్లో వుండే నిధి నిక్షేపాలూ, వస్తువులూ చూడగల శక్తి నీ కళ్ళకు కలిగిస్తాను. అయితే, ఆ నిధి నిక్షేపాలు నీకు ఉపయోగ పడవు. ఈ అపూర్వ విద్య ప్రదర్శించి, సుఖంగా కాలం గడుపు,'' అన్నాడు సిద్ధుడు.

తరవాత ఆయన వర్ధనుడి కళ్ళకు, తన దగ్గిర వున్న దండ కమండలాలను మెల్లగా తాకించి, కొంతసేపు ఏదో మంత్రం చిన్నగా జపించి, వాణ్ణి కళ్ళు తెరవమని,

వర్ధనుడు ఆయన పాదాలకు నమస్కరించి బయలుదేరాడు. వాడికి తన గ్రామం వదిలి మరెక్కడికైనా పోవాలని బుద్ధి పుట్టింది. వాడు ఒక అడవి దారి వెంట నడుస్తుండగా, యాత్రికుల బృందం ఒకటి, కంటబడింది. వాళ్లు సమీపంగా వస్తున్నంతలో వర్ధనుడు పెద్దగా గొంతెత్తి, వున్న చోటనే ఆగమంటూ హెచ్చరించాడు. వాళ్ళు ఆగి, వాడికేసి ఆశ్చర్యంగా చూడసాగారు.

''ఇక్కడ నేలదిగువున ఊబి వున్నది. ఇంకొంచెం ముందుకు మీరు వచ్చి వున్నట్టయితే, అందరూ ఆ ఊబిలో కూరుకు

పోయి వుండేవాళ్ళు," అన్నాడు వర్ధనుడు. వర్ధనుడి మాటలకు యాత్రికులు మరింతగా ఆశ్చర్యపోయారు. అక్కడ నేలమీద ఎండుటాకులూ, పచ్చికా, ఏవో చిన్న చిన్న మొక్కలూ కనిపిస్తున్నాయి. ఊబి వున్న చిహ్నాలే లేవు.

యాత్రికుల్లో ఒకడు వర్ధనుణ్ణి వెర్రివాడి కింద జమకట్టి, దుడుకుగా ముందుకు అడుగు వేశాడు. ఆ మరుక్షణం మెడలోతు ఊబిలో కూరుకుపోయాడు. వెంట వున్న వాళ్ళు అతణ్ణి భుజాలు పట్టుకుని అతికష్టం మీద బయటికి లాగారు.

దానితో యాత్రికులకు వర్ధనుడు దేవుడిలా కనిపించాడు. వాళ్ళు, వాడికి కృతజ్ఞత చెప్పుకుని, కొన్ని వెండినాణాలు యిచ్చి తమదారిన వెళ్ళిపోయారు. జీవితంలో మొదటిసారిగా లభించిన ఆ డబ్బును వాడు దుస్తుల్లో భద్రంగా దాచుకున్నాడు.

కొంత సేపటికి వర్ధనుడు అడవి దాటి ఒక గ్రామం చేరాడు.

అక్కడ ఒక ఇంటిలోంచి పసిపాప ఏడుపూ, ఆ వెంట తల్లి దీనాలాపనా, తండ్రి ఓదార్పూ వినిపించాయి. పాప ఆకలికొద్దీ గోల చేస్తున్నది.

వర్ధనుడు ఆ ఇంట్లో ప్రవేశించి, తన దగ్గిరున్న వెండినాణాలు కొన్ని తండ్రికి యివ్వబోతూ, నేలమీద దృష్టిపడి ఎక్కడ లేనంతగా ఆశ్చర్యపోయాడు.





ఆ నిరుపేద నట్టింట నేల అడుగున ఒక కంచుపాత్రలో చాలా బంగారు నాణాలున్నాయి.

వర్ధనుడు పేదవాడితో, "నీ నట్టింట లక్ష్మి నాట్యం చేస్తుంటే, చంటిబిడ్డ ఆకలే తీర్చలేక పోతున్నావా? ఎంత ఆశ్చర్యం!" అన్నాడు.

పేదవాడు, వర్ధనుడి కేసి చిరుకోపంగా చూస్తూ, "నా పేదతనం చూస్తే, నీకు గేలిచేయ బుద్ధవుతున్నదా?" అన్నాడు.

"అలాంటిదేం లేదు. నిజమే చెపుతున్నాను. ఇక్కడ తవ్వి చూడు!" అని వర్ధనుడు పేదవాడికి కంచుపాత్ర వున్న చోటు చూపించాడు.

అక్కడ తవ్వి చూడగా బంగారు కాసులున్న పాత్ర బయట పడింది. పేదవాడు సంతోషంగా వర్ధనుడికి నమస్కరించి, "ఈ రోజుతో నా దారిద్ర్యం తీరిపోయింది!" అని వర్ధనుడు వద్దన్నా వినకుండా కొన్ని బంగారు కాసులిచ్చాడు.

ఈ విధంగా వాడు నెలరోజుల పాటు చాలా గ్రామాలు తిరిగి, గ్రామస్థులకు చిన్న, చిన్న నిధి నిక్షేపాలతో పాటు, వాళ్ళు లోగడ పోగొట్టుకున్న విలువైన వస్తువులూ, ఇళ్ళ పెరళ్ళలో దాగి వున్న విషసర్పాలనూ చూపించి చాలా సహాయపడ్డాడు. ఇలా సహాయం పొందిన వాళ్ళందరూ వర్ధనుడికి ఏదో కొంత డబ్బిస్తుండే వాళ్ళు. వాడి జీవితం హాయిగా గడిచిపోతున్నది.

ఒకనాడు వర్ధనుడు పంటపొలం గట్టు వెంట నడిచి పోతూండగా, అడుగులోతు భూమికింద లంకెబిందెలు కనిపించాయి. ఆ పొలం ఇద్దరన్నదమ్ముల ఉమ్మడి ఆస్తి. ఇద్దరూ కష్టపడి పని చేస్తూ, పిల్లా, పాపలతో ఎంతో అన్యోన్యంగా బతుకుతున్నారు.

వర్ధనుడు లంకెబిందెల సంగతి ఆ సమయంలో పొలం పని చేసుకుంటున్న తమ్ముడికి చెప్పి, తన దారిన గ్రామంలోకి వెళ్ళాడు. లంకెబిందెల మాట వింటూనే

తమ్ముడిలో స్వార్థం తలెత్తింది. అతడు ఒక అర్ధరాత్రి వేళ వాటిని తవ్వుకు పోయేందుకు పొలానికి వచ్చాడు. ఈ సంగతి పసిగట్టిన అన్న తాను కూడా పొలానికి వచ్చి, తమ్ముడు తవ్వి తీసిన లంకెబిందెలలో భాగం కావాలన్నాడు. తమ్ముడు యివ్వనన్నాడు. దానితో ఇద్దరూ కలహించుకుని, ఒకళ్ళ నొకళ్ళు స్పృహ తప్పిపోయేలా కొట్టుకున్నారు. గ్రామస్థులు తెల్లవారాక వాళ్ళను ఆ స్థితిలో చూసి, గ్రామానికి మోసుకు వచ్చారు. ఈ సంగతి తెలియగానే వర్ధనుడి మనస్సు వికలమైపోయింది. తన అపూర్వవిద్య యితరులకు మేలుతోపాటు, కీడు కూడా చేయగలదని గ్రహించాడు.

వాడు అప్పటికప్పుడే తన గ్రామంలోని సిద్ధుడి దగ్గిరకు పోయి, జరిగింది చెప్పి, "స్వామీ, ఇప్పుడు నన్నేం చేయమంటారు?" అని అడిగాడు.

సిద్ధుడు ఒక క్షణం ఆలోచించి, "నాయనా, తగిన వయసులో బతుకు తెరువుకు అవసరం అయిన ఏ వృత్తీ నేర్వనందునే, గతంలో నీవు చిక్కులపాలయ్యావు. ఇప్పుడు నేర్చిన యీ అపూర్వవిద్య నీకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నది. ఒక పని చెయ్యి! ఒక సారి యీ విద్యను, నీ స్వార్థానికి ఉపయోగించుకో. తరవాత నీకు నిధి నిక్షేపాలను చూడగల శక్తి నశించి పోతుంది. ఈ సంగతి నీకు లోగడే చెప్పాను," అన్నాడు.

వర్ధనుడు, సిద్ధుడి వద్ద సెలవు తీసుకుని, ఊరి పొలిమేరల కేసి బయలుదేరాడు. అక్కడ ఒక మర్రిచెట్టు కింద, వాడికి ఒక మట్టిపాత్రలో కొన్ని వెండి నాణాలు కనిపించాయి. మరేదైనా పెద్ద నిధికోసం ప్రయత్నిద్దామనే దురాశకు లోనుగాకుండా, వాడు వాటిని తవ్వి తీసుకున్నాడు.

తరవాత ఆ ధనంతో వాడు కొంత పొలం కొని, ఒళ్ళువంచి సేద్యం చేసుకుంటూ, ఏ యిబ్బందులూ లేకుండా సుఖంగా బతికాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. K. Rao



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పైకిలాగు నన్ను రెండవ ఫోటో : పడిపోనీయను నిన్ను

పంపినవారు : ఇమ్మడిశెట్టి సోమయ్య, తిమ్మసముద్రం-523 189

*బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా ? సమాధానాలు :

1. గ్రీకులు; అలెగ్జాండర్ దండయాత్ర చేసిన క్రీ. పూ. 327వ సంవత్సరంలో వచ్చారు. 2. నికొలో కాంటి; 1420 వ సంవత్సరంలో ఆయన విజయనగరాన్ని దర్శించాడు. 3. అథెనేసియస్ నిక్టిన్; 1470 వ సంవత్సరంలో. 4. డోమింగోస్ పోస్; 1522వ సంవత్సరంలో. 5. రాజస్థాన్‌లోని జయపూర్ ప్రాంతం.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188 Arcot Road Madras 600 026 (India) Controlling Editor: NAGI REDDI

# చందమామ

రాబోవు సంచిక

## దీపావళి ప్రత్యేక సంచిక

★ ఎక్కువ పేజీలతో

★ అదనపు కథలతో

★ ఆకర్షవంతమైన రంగు, రంగుల చిత్రాలతో

★ ముచ్చట గొలిపే ముఖచిత్రంతో
అత్యంత మనోహరంగా వెలువడుతున్నది.

★ వెల: 2-50



# మాల్టోవా ముఠా—
# వాళ్ళు ఎప్పుడేం చేస్తారో తెలియదింక !



మాల్టోవా తాగే పిల్లలంటే యిక చెప్పాలా! జీవితంలో ఆనందాన్ని సంపూర్తిగా, జుర్రుకుంటారు—స్కూల్లోనేం, ఆటల్లోనేం. మంచితనం నిండుగా ఉన్న మాల్టోవా పిల్లలకెంతో హితకరమైనదేకాక, పాలను మంచి రుచికరమైన పానీయంలా మార్చివేస్తుంది కూడా!

**ప్రకృతి ఒడిలో పండిన గోధుమలు బార్లీల మాల్టు**

పంజాబులో పండిన గోధుమలు, బార్లీ, మాల్టోవా ప్లాంటులో పుష్టికరమైన మాల్టుగా మారిపోతాయి. ముఖ్యమైన ఖనిజాలు, విటమిన్-B తోటి మాల్టోవా సత్వరం శరీరంలో ఇమిడిపోయే జీర్ణీకృతాహారం.



**శుద్ధమైన, హితకరమైన పాలు**

మా స్వంత పాల సేకరణ కేంద్రాలద్వారా వస్తాయి, మాల్టోవాలో చేరే పాలు. ఇవి సదా నూటికి నూరుపాళ్ళ శుద్ధమైనవి, నూరుపాళ్ళు పుష్టికరమైనవి.

**నోరూరించే కోకో రుచి**

మేలైన విదేశీ కోకోనే మేము వాడుతాము. లేకపోతే మరి మీకు మంచి రుచి, మంచి పుష్టి ఎలా దొరుకుతాయి? కోకోతో కొత్త జీవం వస్తుంది. సేద తీరి విశ్రాంతికి దోహదమవుతుంది.



**శక్తికోసం చక్కెర**

ఏరి కోరి ఎన్నుకున్న శుద్ధమైన, తెల్లటి పంచదార. పిల్లలకవసరమైన ఆ అదనపు శక్తికోసం అతి ముఖ్యమైనది.

**విటమిన్లతో ప్రత్యేకించి పటిష్ఠం చేయబడింది**

ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, విటమిన్లు, ఖనిజాల అద్వితీయ సమ్మేళనం మాల్టోవా. ఇది అదనపు విటమిన్-A, నియాసిన్, విటమిన్-B1 విటమిన్-D2 లతో కూడా పటిష్ఠం చేయబడింది. కృత్రిమ సువాసనలిందులో లేవు.






**JIL** జగత్ జీత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

1981, 1982లో మాండే (ప్రపంచ) ఎంపికలో బంగారు పతకాల విజేతలు

## విటమిన్లతో నిండిన మాల్టోవా: ఆరోగ్యం, బలం మరియు శక్తికోసం

SIMOES/JIL/1/83 TL

నేను **యూకోబ్యాంకులో**
దాచుకున్న నా డబ్బుతో
ఈ సైకిలు కొనుక్కున్నాను.

నా స్నేహితుడి సైకిలు అడిగి తెచ్చుకోటానికి వీల్లేదు.

నేనే ఒకటి స్వంతంగా కొనుక్కోవలసి వచ్చింది.

అందుకని డబ్బు దాయటం మొదలుపెట్టాను.

"నేను దాచుకున్న డబ్బు పెరగాలంటే దాన్ని యూకోబ్యాంక్‌లో ఆదా చెయ్యాలన్నారు" నాన్నగారు.

వాళ్ళదగ్గర దాచుకున్నందుకు వాళ్ళు మనకి కొంత డబ్బు ఇస్తారు. దానినే "వడ్డీ" అంటారు.

అందుకే యూకోబ్యాంకులో ఆదా చేస్తే ఇంట్లో కన్నా తొందరగా ఎక్కువ డబ్బు కూడబెట్టచ్చు.

చూశావా! అందుకే ఇవాళ నా స్వంత సైకిలు మీద నేను పోతున్నాను.



**యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్**

**మీకు దగ్గరలోవున్న మంచి సదుపాయాలున్న బ్యాంక్**

UCO/CAS-108/82 TEL






నావెంటే నానేస్తం నే పిలిస్తే పలుకు
ఆ చక్కనైన ఎలుగు పేరే పలుగు
మనసేస్తే దానికి తినడానికి పెడతా
ఇస్తుందపుడేది జెమ్స్ నాకింక ఎంచక్కా

**చేజిక్కించుకోండి ఆ మధురక్షణాల్ని**
**చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని!**



క్యాడ్‌బరీస్
చాక్లెట్లు

LIKE TO FLY INTO THE EXCITING WORLD OF ADVENTURE AND HUMOUR?



DOLTON

SUPER COMICS CAN TAKE YOU THERE EVERY FORTNIGHT!

IT COSTS ONLY Rs.2.00 A COPY – EVIDENTLY THE MOST EASILY AVAILABLE COMICS MAGAZINE YOU'VE EVER READ:

ITS 32 FULL COLOUR PAGES TAKE YOU THROUGH MYSTERY AND EXCITEMENT TO A RENDEZVOUS WITH THE SUPER HEROES —

SUPERMAN & BATMAN




DOLTON PUBLICATIONS
MADRAS 600 026

# రాము-శ్యాము

## లక్కీ నంబరు 50






















వెండి చారలుంటేనే కొనండి
నకిలీవాటి మోసంలో పడకండి.

everest/83/PP/40 II